

'ఆనంద నిలయమ్' నాటికకు పునాదిరాయి వేసిన మిత్రుడు 'శ్రీవాత్సవ.' మొదటిసారి 1954 లో ఆలిండియా రేడియో మద్రాసు, విజయవాడలనుండి ప్రసారితమైనది. ఈ క్రింది నటీ నటులు ప్రసారంలో పాల్గొన్నారు:

తండ్రి: శ్రీ వంగర వెంకటసుబ్బయ్య
తల్లి: శ్రీమతి ఎన్. ఉదయలక్ష్మి
కొడుకు: (కీ. శే.) శ్రీ వై. జోగారావు
కోడలు: కుమారి వావిలికొలను కృష్ణకుమారి
కూతురు: శ్రీమతి కాటూరి అన్నపూర్ణ
అల్లుడు: శ్రీ ఎ. ఎస్. గిరి

తిరిగి యీ నాటకం 1957 జనవరిలో మద్రాసునుండి ప్రసారితమైనప్పుడు యీ క్రింది నటీ నటులు పాల్గొన్నారు:

తండ్రి: శ్రీ వంగర వెంకటసుబ్బయ్య
తల్లి: శ్రీమతి ఎన్. ఉదయలక్ష్మి
కొడుకు: శ్రీ ఏ. పుండరీకాక్షయ్య
కోడలు: కుమారి వావిలికొలను కృష్ణకుమారి
కూతురు: శ్రీమతి కాటూరి అన్నపూర్ణ
అల్లుడు: శ్రీ పేకేటి శివరామ్

నాటకానికి ప్రాణంపోసి సామర్థ్యంతో నిర్వహించిన నటీ నటులకూ, పునాదిరయి వేసిన 'శ్రీవాత్సవ'కూ నా కృతజ్ఞత.

—రచయిత.



## సమర్పణ :

దయామయి, అమృతమూర్తి
బహుముఖ ప్రజ్ఞావతి
చెల్లెమ్మ శ్రీదేవికి

# ఆనంద నిలయమ్

★

## రంగము 1

(ప్రీథిగుమ్మంలో ఉంపుండి ఒకడు సన్నాయి పీ అని ఊదుతూ ఉంటాడు. వాడల్లా ఊదినప్పుడల్లా బూరావాడు పీ మనిపిస్తూ ఉంటాడు. పాటకాదు—ఊరికే శబ్దం.)

స్త్రీ: హేమా.... హేమా....వంటింటి అల్మారాలో హారతి కర్పూరం డబ్బా ఉంది. ఓమారిలా తెస్తావా? (దేవుడిదగ్గర గంట వాయిస్తుంది-ఆపేసి) హేమా....!

హే: (విసుగ్గా) ఎందుకమ్మా....?

స్త్రీ: అంత విసుగు దేనికే?

హే: విసుగంటావు - ప్రాణాలు తోడేస్తుంటేను. ఆ మనిషికి యింకీ జన్మలో బుద్ధిరాదు.

స్త్రీ: అల్లుడేనా?

హే: మరెవరు? ఆయనగారే. రోజుకో నిర్వాకం. మధ్య నా కొచ్చింది చావు.

స్త్రీ: ఎందుకే అలాంటి అఘాయిత్యం మాటలూ? అందులోనూ ప్రదోషకాలంలో?....మళ్ళీ ఏంవొచ్చిందిప్పుడు?

హే: ఎవడో స్నేహితుడిదగ్గర పాతిక రూపాయలు ఎప్పుడో అప్పు పెట్టారట. వాడిప్పుడు ఊరెళ్ళిపోతున్నాడు, రాత్రిబండికే....ఏం దారి?

స్త్రీ: బాగుంది వరస. నిన్ననే గదే-ఆ దిక్కుమాలిన పుస్తకాల పార్శెలేదో విడిపించడానికి పది రూపాయలా-ఎంతా?

హే: ఎంతో కొంత పోనిద్దూ, చూస్తున్న కొద్దీ అసహ్యం వేస్తోంది. మళ్ళీ ఏ ముహం పెట్టుకు నాన్నగార్ని అడగను?

స్త్రీ: అడిగితే యిస్తారుగనకనా?-హయ్యో రామ. (కంఠంమార్చి) ఆ సన్నాయివాళ్ళెందుకే అలా ఊత్తున్నారూ?

హేమ: ఊదుకోనీ. ఎవ రేగంగలో దిగినా నాకేం దిగులులేదు.

స్త్రీ: అదికాదే....ఏం కావాలి వాళ్లకి?

(హేమా....హేమా....అని దూరంనుంచి పురుషకంఠం కేక:)

సావిత్రి: (ప్రవేశిస్తూ) వొదినా....అన్నయ్య పిలుస్తున్నారు.

హే: వెళతాలే. ఇంక నాకిదే ఉద్యోగం. ఇంతేగా బతుకూ.

సా: మధ్య నామీద విసుక్కుంటా వెందుకు హేమా?

స్త్రీ: ఇంతసేపూ ఎక్కడికెళ్ళావు సావిత్రీ?

సా: వాళ్ల రాజేశ్వరి అర్జంటుగా రమ్మందత్తయ్యా.

స్త్రీ: బాగుంది వరస. సరేగాని - వంటింటి అల్మారాలో హారతి కర్పూరం ఉందీ....

శివరావు: (ప్రవేశిస్తూ) హేమేదీ?

స్త్రీ: నీ కోసమే అలా వెళ్ళింది. అదిసరేగాని నాయనా....మళ్ళీ ఏదో పీకలమీదికి తెచ్చావట?

శి: మీకు ప్రతి చిన్న విషయమూ కొంప మునిగిపోయినట్లే అని పిస్తుంది-వీధిలో మనుషుల్ని అలా నిలబెట్టి....

స్త్రీ: ఎవర్ని? నీ స్నేహితు డెవరో గుమ్మం దగ్గిర కాపలా కాస్తు న్నాడా ఏమిటి?

శి: (చిరాగ్గా) ఆ గొడవ కాదండీ. సన్నాయివాళ్ళు. వినపడ్డంలా? గంటనించీ ఒకటే కాకిగోల-ఏ పనీ తోచనివ్వకండా!

స్త్రీ: ఆ ముక్కే నే నిందాక హేమతో అంటే—ఊరుకోనీ అంది.

శి: అంటుందంటుంది. మధ్య తన సొమ్మేం పోయిందీ-వాడు పీ అన్నప్పుడల్లా నా గుండెల్లో దడ!

సా: (నవ్వుతూ) సన్నాయి వింటేనే హడలిపోతే ఎలాగ అన్నయ్యగారూ?

శి: నీకు తెలీదులే. మనస్సు బలహీనంగా ఉంటే ఏమి చిటుక్కు-మన్నా చెడ్డ భయం వేస్తుంది.

స్త్రీ: బాగుంది నాయనా వరస. ఎవరైనా వింటే నవ్విపోతారు.... వినిపించుకోవేం సావిత్రీ? ఏమిటా పరధ్యానం?

సా: ఏమత్తయ్యా?

స్త్రీ: వంటింటి అల్మారులో హారతి కర్పూరం ఉంది-తెచ్చి పెట్టమంటే-అన్నట్టు వంటవాళ్ళకి కబురు పెట్టాం-వచ్చారా? ఏం శివరావ్? నీ కేమయినా తెలుసా?

శి: అదొక్కటే తరువాయి. వంటవాళ్ల గొడవ నా కెందుకండీ మధ్య....సావిత్రీ, మీ ఆయనొచ్చాడా?

సా: ఇంకా రాలేదు. అప్పుడే వస్తారా? రాత్రి పదీ కొట్టొద్దూ.

శి: చెప్పరేం- అత్తయ్యా....ఆ సన్నాయివాళ్ల సంగతేమిటి?

స్త్రీ: నాకేం తెలుసోయ్....అదిగో అబ్బాయొస్తున్నాడు. వాణ్ణడుగు. ఏరా గోపాలం....

గో: కొంపలో అడుగుపెట్టానో లేదో అప్పుడే మొదలా. సావిత్రీ.... కొంచెం మంచినీళ్ళియ్యి. ఏం బావా? ఏమిటీ గొడవ?

హే: (ప్రవేశిస్తూ) ఏమండోయ్....ఇక్కడా ఉన్నారు! మీ కోసం ఎవరో భాగీరథిట, వచ్చాడు.

శి: (అదిరిపడి) చంపేశావ్....వీడూ యిప్పుడే దిగబడాలి..సరే.

స్త్రీ: భాగీరథెవడే?

హే: (చిరాగ్గా) ఎవడో గంగా భాగీరథి. మనకెందుకు పోనిద్దూ. ఉన్నవారితోనే సతమతం అవుతూంటే—

గో: మా బావ ఫ్రెండ్సులో ఒక్కడు సవ్యమైనవాడు లేడుగదా. ఎక్కడ పోగుచేస్తాడో గాని.

సా: ఏమండీ, పెందరాడేవస్తే సాయంత్రం సినిమాకి తీసికెళతానన్నారూ?

గో: (కోపంగా) నీ కేమైనా మతుందా పోయిందా? తెల్లారితే అంత తతంగం నెత్తిమీద పెట్టుకుని-

సా: దానికీ-మీరు నన్నిప్పుడు సినిమాకి తీసికెళ్లడానికీ సంబంధం ఏమిటీ?

స్త్రీ: ఎంత విడ్డూరవేఁ! సంబంధంలేదూ మరీ. ఇద్దరూ వెళ్ళి కాస్త నలుగుర్నీ పిలిచిరావాలా?

సా: పెద్దవాళ్లు మీరూ మావయ్యా కలిసి వెళ్ళి పిలవాలి గానీ....

గో: అవునమ్మా....ఈ పిలుపుల గొడవ నా నెత్తిన పెట్టకు.

స్త్రీ: బాగుందిరా వరస. పని తెమలక నేను చస్తూంటేనూ. వంటవాళ్ళకి కబురు పెడితే వత్తా లేదు. వెళ్ళిన వీరన్నగాడు యిప్పటికింకా ఊడిపడలేదు. ఎంతలేదన్నా ఓ ముప్ఫయిమందికేనా భోజనాలు పెట్టాలా-

సా: (నవ్వుతూ) ముప్ఫయి మందికే....? చూస్తూ చూస్తూ మావగారు ముప్ఫమందికి భోజనాలు పెట్టిస్తారా.

స్త్రీ: చాల్లే. నేర్చుకుపోయావు. పెద్దా చిన్నా లేకండా. ఆర్జించే వాళ్ళ కష్టాలు ఆర్జించే వారికి తెలుస్తాయిగాని....

సా: ఆ కష్టం ఏమిటో నాకూ కొంచెం తెలుసు అత్తయ్యా. నేనూ రెండేళ్ళపాటు ఉద్యోగం చేశాను. మీ దయవల్ల ఆ కష్టం తప్పించారు గాని—

స్త్రీ: నా మీద నీ కోపమంతా అదేగా....

గో: ఆ గొడవ యిప్పడెందుకుగాని-పిలుపులకి నేనే వెళ్ళాలా అమ్మా?

స్త్రీ: వెళ్ళొద్దురా మరీ?

గో: నే వెళ్ళను. అంతగా అయితే సావిత్రినీ, నాన్నగార్నీ వెళ్ళి పిలిచిరమ్మను.

స్త్రీ: ఇంత వంటింటి కుందేలువయితే ఎలాగరా బాబూ?

సా: నే ననుకుంటున్నదీ అదే.

గో: కుందేలూ లేదు-చెప్పులపిల్లీ లేదు-నా తరంగాదు-అంతే.

హే: (ప్రవేశిస్తూ) అమ్మా, తాపీ మేస్త్రీ వొచ్చాడు. పొద్దున్నేవో మేకులూ బందులూ కొన్నాట్ట. ఆ డబ్బు కావాలట.

స్త్రీ: నేనేం చెయ్యను తల్లీ. నాన్నగారొచ్చాక ఇమ్మను.

హే: అలాగే చెప్పాను. వాడు వినందే. డబ్బు నీకిచ్చి వెళతా నన్నారట నాన్నగారు.

స్త్రీ: అంత అదృష్టం కూడానా. యీ జన్మలో నోచుకోలేదది. ఒరే గోపాలం కాస్త నువ్వెళ్ళి చూసిరా-అదేమిటో.

గో: నాకెందుకొచ్చిన గొడవ. నాన్నగారు ఒచ్చే వేళయింది-ఉండమను.

(హేమా.... హేమా....అని శివరావు దూరంనుండి పిలుపు)

హే: ఓయ్....వస్తున్నా....అబ్బబ్బబ్బ....ప్రాణాలు తోడేస్తున్నారురా బాబూ, ఎందుకొచ్చిన సంసారమోగాని....(దగ్గిరగా వచ్చినట్టు) ఎందుకండీ?

శి: ఇలా కూర్చో హేమా.

హే: ఈ మర్యాదలకేం గాని-చెప్పండి.

శి: మరేంలేదు హేమా. చీకటి పడిపోతోంది. రైలు టైమైంది. వాడు ఏ క్షణాన ఒస్తాడో అని భయంగా ఉంది.

హే: ఏమ్చేం చెయ్యమంటారు చెప్పండి. నా చేతిలో కానీలేదు. అమ్మదగ్గర అసలే లేదు. నిన్నకూడా ఇలాగే కొంప మునిగిపోయిందన్నారు. పక్కింటి సత్యలక్ష్మిగార్ని బతిమాలి పన్నెండు రూపాయలు తెచ్చాను. మళ్ళీ యివాళ యిలా చంపితే ఏం దారి?

శి: అదిగాదు హేమా. వీడివాళే ఊరెళతాడని నేను కలగన్నానా? అన్నీ అలా ఒక్కసారే ముంచుకొస్తున్నాయి. అదీగాక - రేపు కొత్తింటికి గృహప్రవేశం ఏమిటి, యివాళ ఎవళ్ళ చేతిలోనూ కానీ లేకపోవడ మేమిటి? అసందర్భంగా లేదూ?

హే: కాసీ మన చేతిలో లేదుగాని-అసలు లేకపోలేదుగా. నాన్న గారు దయతలచి యిస్తే ఉంది-లేకపోతే లేదూ....ఇందులో అసందర్భ మేముందీ?

శి: ఇలా ఎన్నాళ్లూ అని?

హే: మీరు గోళ్ళు గిల్లుకుంటూ యిలా కూర్చున్నన్నాళ్లు.

శి: నువ్వూ అలాగే అంటావా హేమా? (జాలిగా) చివరికీ ఏస్థితి లోంచి ఏ స్థితిలోకొచ్చాం. ఆఖరికి నా హేమకి కూడ నేను దూరం అయా నన్నమాట.

హే: అంటే? మంచిచెప్పితే హేమ దూరం అయిపోతుందన్న మాట?

శి: ఇప్పుడీ గండం గడవడం ఎలాగ?

హే: అవునుగానీ-ఒక్కటి చెప్పండీ. తిరిగి ఎలా తీరుస్తామనుకొని అప్పుచేశారు? అందులోనూ ఒకటీ రెండూ కాదు. పాతిక రూపాయిలు!

శి: ఇక్కడే నాకు మనుషులు అర్థంకారు. ఆ పాతిక రూపా యిలూ నేనేం తినేసేనా హేమా? పుస్తకాలు కొన్నాను - చక్కని వేదాంత గ్రంథాలవి. మళ్ళీ దొరకవు.

హే: నా మొహం. దిక్కుమాలిన పుస్తకాలూ మీరూనూ. ఇంగిత జ్ఞానం లేకపోయాక యిక వేదాంతమే గతి!....ఏమిటో నేను పెట్టుకున్న ఆశలు వేరూ-నడుస్తున్న కర్మ వేరూనూ.

శి: నేనూ అదే అనుకుంటూంటాను. చక్కని తోట, అందులో అందమైన చిన్న కుటీరం-గోడలమీద అజంతా చిత్రాలు-ఆ కుటీరంలో రాజశేఖరుడిలా నేనూ-అవంతిసుందరిలా నువ్వూ....ఏనాటికైనా అలంకార శాస్త్రంలో నేనో హేమచంద్రుణ్ణో-ఆనంద వర్ధనుణ్ణో అవాలని ఉంది హేమా.

హే: అదిగో, ఆ పైత్యం మూలానే యిలా ఉన్నది మనం.

శి: పోనీ, ఒక్క సాయం చేసిపెట్టకూడదూ?

హే: చెప్పండి.

శి: ఏంలేదు. పొద్దున్న సావిత్రికి ఏదో మనియార్డరు వచ్చినట్టుంది.

హే: ఏముందీ... పత్రికలవాళ్ళకి ఏవో కథలు రాసి పంపించిందట-వాళ్లు పంపించినట్లున్నారు-ఓ పాతిక రూపాయిలు.

శి: కాస్త అవసరానికి సర్దుతుందేమో .... అప్పకింద .... మళ్ళీ యిచ్చేద్దాం.

హే: సిగ్గులేకపోతే సరి. ఇంత బతుకూ బతికీ చివరికి సావిత్రిని ప్రాధేయపడడం. అదీ-దాని గర్వం-ఎలాగయితేనేం చదువుకుంది-అన్నట్టు కొన్నాళ్లు ఉద్యోగంకూడా చేసింది-అందుకే నన్నూ మా అన్నయ్యనీ పురుగుల్ని చూసినట్టు చూస్తుంది.

శి: అన్యాయం మాటలనకు. సావిత్రి-పాపం-గోపాలాన్ని ఎంత జాగర్తగా చూస్తుంది.

హే: (కోపంగా) పోన్లెండి. మీరు మెచ్చుకుంటే మెచ్చుకున్నారు గాని-నా దగ్గిర మాత్రం ఆవిడగార్ని పొగడకండి. అబ్బబ్బ ఏం మనుషులు.

శి: (పరాభవం పొందినట్లు) నన్ను చూస్తూంటే అంత విసుగ్గా ఉందా నీకు?

హే: (అంతకంటె విసుగ్గా) నా విసుగు మిమ్మల్నేం చేస్తుంది లెండి.

శి: ఇలా వింటావా హేమా. నీ ధోరణి మరీ మితిమీరిపోతోంది. ఆనక విచారిస్తావు సుమా!

హే: ఏమీ విచారించను. మీ యిష్టం వొచ్చినట్లు చేసుకోండి. ఈ తాటాకు చప్పుళ్ళకి జడిసే రకంగాదు-హేమంటే ఏమనుకున్నారో.

శి: సరే అయితే, విషపాత్ర నిండిపోయింది. ఈ ఇంట్లో నేనింక ఒక్కక్షణం ఉండను. ఇంతకంటె వీధులు తిరిగి బిచ్చమెత్తుకోవడం మేలు.

హే: ఆహా....అదికూడా చాతకాదు మీకు! మీకు తెలిసిందల్లా ఒక్కటే-చీటికీ మాటికీ పెళ్ళాన్ని బెదిరించడం.

శి: ఇంక ఆ బాధ ఉండదులే నీకు. ఈ క్షణం నుంచీ నీదోవ నీది నాదోవ నాదీ....సరేనా?

హే: తప్పకండా వెళ్ళండి. నేనేమీ అడ్డురాను. (కంఠం హెచ్చించి) తెలిసిందా? నాకోసమని ఎంతమాత్రం మీరు ఆగొద్దు.

శి: సరే. నాపెట్టే బెడ్డింగూ సర్దెయ్.

హే: నేనేం దాసీదాన్ని కాదు మీకింద చాకిరీ చెయ్యడానికి! (హేమా హేమా అని అమ్మ పిలుస్తుంది.) వస్తున్నా....అన్నీ తుంటరి వేషాలు. భయపడతా ననుకున్నారు కాబోలు. నాకేం భయంలేదు.... ఎందుకే అమ్మా?

స్త్రీ: ఏవిటీ....ఆ సణుగుడూ? ఎవరిమీదా?

హే: మరెవరు? మీ అల్లుడుగారు.

స్త్రీ: మళ్ళీ యిప్పుడేమొచ్చిందీ?

హే: ఏవుందీ. ఈ కొంపలో అందరికీ లోకువ నేనేగా, అంచేత బెదిరింపులు. ఈ కొంపలో ఇంకొక్కక్షణం ఉండరట. అడిగిన పాతిక రూపాయలూ ఇవ్వలేదని అలక.

స్త్రీ: బాగుంది వరస. సావిత్రేదీ?

హే: నన్నే అడుగు — సావిత్రెక్కడుందో. ఎక్కడుంటుంది? ఏ పుస్తకమో పట్టుకుని అన్నయ్య గదిలో ఉంటుంది.

స్త్రీ: అంతా ఒక్కలా ఉంది వరస. ఇప్పుడేం దారి. తెల్లారితే గృహప్రవేశం. ఇంట్లో బోలెడంత చాకిరీ. మీనాన్నగారేమో ఏమీ పట్టించుకోరు. ఇప్పటికింకా కొంప చేరలేదు. తెల్లారితే ఏమవుతుందో ఏమో, మరి. అందుకే వెంకటేశ్వర్లుకి దీపారాధన చేయిస్తానని మొక్కుకున్నాను.

హే: నీకెంతసేపూ నీ దేవుళ్ళూ, వ్రతాలూ పూజలూ తప్ప యింకో ప్రపంచమే లేదు.

స్త్రీ: బాగుందే వరసా. ఒక్కసారి వెళ్ళి ఆ సావిత్రిని యిలా పిల్చుకురా, కాస్త పనుంది.

హే: పిలిస్తేగాని ఆ దొరసాని రాదు. సరే....సావిత్రీ....సావిత్రీ.... (అని అరుచుకుంటూ వెళుతుంది.)

* * *

గో: సావిత్రీ....ఆ మూల ఏం చేస్తున్నావు?

సా: ఊరికే కూర్చున్నాను. ఏం?

గో: అలా కూర్చోపోతే కాస్త వెళ్ళి అమ్మకి సహాయం చెయ్యకూడదూ? తెల్లారితే గృహప్రవేశం గదా?

సా: ఆవిడేమైనా చెప్తే చేస్తాను. నా అంతట నేనేదీ కలగచేసుకోను.

గో: సినిమాకి తీసికెళ్ళలేదనేగా నీకోపం అంతా? డబ్బులు లేవన్నానుగా?

సా: ఆమాత్రం నాకూ తెలుసు. మీ దయవల్ల మధ్యాహ్నం నాకేదో ఓ తృణం మనియార్డరొచ్చిందిగా. తలచుకుంటే ఆ డబ్బుతో వెళ్లుండే వాళ్ళం. నేను బాధపడేది అందుకుగాదు. ఈ సంసారంలో నా స్థానం ఏమిటో తలుచుకున్నకొద్దీ బాధగా ఉంటుంది.

గో: రేపు కొత్త యింట్లో గృహ ప్రవేశం కాబోతున్నాంగా ఇలాంటప్పుడా నీ బెంగలూ, విచారాలూ?

సా: నే నిప్పుడేవన్నాననీ? కనీసం దుఃఖం వొచ్చినప్పుడు ఏడవ డానికి కూడా వీలులేదా? అదీ పైకి ఏడవడం లేదే?

గో: (విసుగ్గా) అయితే యిప్పుడు నన్నేం చెయ్యమంటావు? అమ్మతో నాన్నతో తగాయిదా పడమంటావా? వాళ్ళస్వభావమే అంత. వాళ్ళు మారరు. సర్దుకు పోవాలి. ఏంచేస్తాం?

సా: అవును. వాళ్ళు మారరు. మీరు మారరు. ఎటొచ్చీ మార గలిగేదీ, మారవలసిందీ, నేనే, ఏం?

గో: నీ యిష్టం వొచ్చినట్టనుకో.

('గోపాలం, ఒరే గోపాలం' అని కేక)

గో: అదిగో....నాన్నగారు ఒచ్చినట్లుంది. పిలుస్తున్నారు....ఏం నాన్నగారూ!

నా: ఏం ఏవిట్రా నీ తలకాయా-నా తలకాయానూ. బయట అంత గొడవ జరుగుతూంటే ఏం చేస్తున్నావురా? ఎలా బతుకుతార్రా బాబూ మీరూ! అంతా నన్ను ఉద్ధరించేవాళ్ళే మళ్ళీ. ఆ సన్నాయివాళ్లు ఎందు కొచ్చారూ?

గో: రేపు మేళానికి బజానాకోసం వచ్చారు.

నా: బజానా....బజానా ...మరేం పనిలేకపోతే సరి. తేరగాఉంది డబ్బు. హేమా....హేమా.

హే: (ప్రవేశిస్తూ) ఏం నాన్నగారూ?

నా: ఆ తాపీ మేస్త్రీనెందుకే అలా తైనాతీ నిలబెట్టావ్?

హే: ఇది బాగుంది వరస. చూశావే అమ్మా.

స్త్రీ: నోరుగనిదాన్ని దానిమీద విసుక్కుంటారెందుకండీ మధ్య? అతగాణ్ణి మీరేటగా-రమ్మన్నారూ? మేకులు కొన్నాట్ట.

నా: కొంటాడు-కొంటాడు-కొనడూ మరీ. వాడి సొమ్మేం పోయిందీ. ఈ మేకుల పేరు చెప్పే నన్ను దివాలా తీయించాడు. సొమ్ము మంచి నీళ్ళలాగ ఖర్చవుతూంటే అంతా గుడ్లు మిటకరించి చూస్తున్నారు. మాటాడవేంరా గోపాలం?

గో: ఏం మాటాడమంటారు?

నా: (విసురుగా) ఆ సన్నాయివాళ్ళూ, తాపీమేస్త్రీ .... అలా గుమ్మందగ్గిర ఎందుకు కాశారూ అంటాను!

గో: చెప్పారుగా....

నా: చెప్పారు. చెప్పకేం....చెప్పి ఏం ప్రయోజనం?

సా: (ప్రవేశిస్తూ) రిక్షావాడు డబ్బులడుగుతున్నాడు మావయ్యగారూ.

నా: వాడొకడూ నా పీకలమీదికి. అందరికీ నా డబ్బే కావాలి. ఎక్కణ్ణుంచి తేవడం? ఇప్పటికే యింటిమీద ముప్ఫయివేలు ఖర్చయింది. రేపు యీ గృహప్రవేశం తంతు ఒకటీ....మధ్యలో యీ రిక్షావాడొకడూ.

స్త్రీ: ఇది బాగుందండీ వరసా. ఆ మాత్రానికి రిక్షా ఎందుకెక్కాలీ? నడిచి రాలేకపోయారా?

నా: కీళ్ళనొప్పులతో నడవలేక రిక్షా ఎక్కాను. అదీ తప్పే?

స్త్రీ: అయితే వాడి డబ్బు వాడికి పారేయండి.

నా: నాకు తెలుసు. మీరంతా నన్ను పీల్చి పిప్పిచెయ్యడానికే యీ కొంపలో చేరారు.

(బయటనుంచి అయ్యగారూ....అని కేక.)

గో: సావిత్రీ....వాడెవడో చూడు.

సా: అదీ చూసే వచ్చాను. మీ బావగారు యింకో రిక్షాని రమ్మన్నారట ఎందుకో.

నా: మీ ఆయనకి రిక్షా ఎందుకు హేమా?

హే: అదిగో ఆయనే వస్తున్నారు. ఆయన్నే అడగండి.

నా: ఏవోయ్ శివరావ్? రిక్షా దేనికీ?

శి: నేను వెళ్తున్నాను మావఁగారూ. ఇంకీ యింట్లో ఒక్కక్షణం ఉండదలుచుకోలేదు.

నా: నీ ఒక్కడికే ఏమిటోయ్. నాకూ అలాగే ఉంది.

సా: అన్నట్టు అన్నయ్యగారూ....మీ స్నేహితుడు - యెవరో వచ్చాడు. రైలుకు వెళతారట-మిమ్మల్నొక్కసారి కనబడమన్నారు.

నా: వాడెవడు? వాడికీ డబ్బేకావాలా? వరమేశ్వరా. ఎలా బతుకుతార్రా మీరంతానూ. తెల్లారితే గృహప్రవేశం మళ్ళీ. డబ్బు....డబ్బు....డబ్బు....ఎక్కణ్ణించి తీసుకురావడం?....మాటాడరేం? ఏరా గోపాలం?

గో: ఏం చెప్పను నాన్నగారూ?

నా: బాంకులో ఉన్నది కాస్తా—యిలా ఖర్చయిపోతే—యింకేం దారి? ఎందుకు కట్టానురా బాబూ నేనీ కొంపా....ఎలా బతుకుతాం....ఏం దారి!

(బయట సన్నాయివాడు గట్టిగా ఊత్తాడు.)

నా: వాడింక కదలడా అక్కణ్ణించి....ప్రదోష సమయంలో యిలా మేళమంతా గుమ్మందగ్గిర ఏమిట్రా భగవంతుడా....

స్త్రీ: నాయనా....తిరపతి వెంకటేశ్వర్లూ. ఈ గండం గడిస్తే-నీకు మణుగు ఆవు నెయ్యి దీపారాధన చేయిస్తాను. రక్షించు తండ్రీ.

సా: ఇదిగో-యిలా చూడండీ....

గో: ఏం?

సా: ఇదిగో-పొద్దున్న వచ్చిన పాతిక రూపాయిలు. ఇవి తీసికెళ్ళి యిచ్చి అందులో కొందర్నయినా పంపెయ్యండి. ఇరుగు పొరుగు వాళ్ళు చూసినా బాగుండదు.

నా: పరమేశ్వరా....ఇంక నేనీ సంసారం చెయ్యలేను. ఎలా బతుకుతార్రా బాబూ....

సా: ఫరవాలేదు మావయ్యగారూ....పిచ్చెక్కి పోకుండా ఉంటే ఎలాగైనా బతుకుతాం. వాడెవడూ .... ఏదో బోర్డు పట్టుకు లోపలికి వస్తున్నాడు?

గో: మన కొత్తింటికి బావ 'ఆనందనిలయమ్' అని నామకరణం చేసి పాలరాయి బోర్డుకి ఆర్డరిచ్చాడుగా....వాడేమో....

నా: ఏమిటీ....పాలరాయి బోర్డా....అయితే నా కొంప తీశారన్న మాటే. పరమేశ్వరా....ఏమిటీ ఖర్చులు....అందరికీ డబ్బు....డబ్బు.... డబ్బు...ఎలా బతుకుతాంరా....బాబూ....ఆ బోర్డు లోపల పెట్టేస్తున్నాడా ఏమిటి కర్మంగాలి!

సా: పోనీ ఏం చెయ్యమంటారు. చెప్పండి మావయ్యగారూ?

నా: ఏం చెప్పను నా కర్మ! ఇప్పుడేం దారి నాకు!

(బయట సన్నాయివాడు గట్టిగా ఊత్తాడు)



# రంగము 2

(దూరాన నేపథ్యంలో జనం కలకలం, పురోహితుల మంత్రాలూ ఒక్కసారి వినిపించి క్రమంగా సన్నగిల్లిపోతాయి.)

తండ్రి: హమ్మయ్య. ఎలాగయితేనేం అయిందనిపించార్రా బాబూ! ఇల్లు కట్టి చూడమన్నారుగాని - గృహప్రవేశం చేసి చూడవలసింది. అమ్మాయ్ హేమా!

హేమ: ఏం నాన్నగారూ?

తం: మనల్ని ఉద్ధరించడానికి ఒచ్చినవాళ్లంతా వెళ్ళినట్టేనా తల్లీ?

హే: ఆఁ....అంతా వెళ్ళారు నాన్నగారూ. ఏం?

తం: రక్షించారు. ఏం అంటావేమిటి హేమా. పిప్పరమెంటు చప్పరించినట్టు ప్రాణాలు చప్పరించేశారుగదూ. పురోహితులు, బాజాలు, వంటవాళ్లు, అందరూచేరి, యిల్లుకట్టగానే కొంప దివాలా తీయించేశారు.... పోనీలే, అంతా ఖర్మ....ఆఖరి విస్తళ్లు లేచాయా?

హే: ఆఁ....అందరూ అయారు, ఎవరో ఒకటీ అరా మినహాయిస్తే. ఆ గొడవేదో సావిత్రి చూస్తోంది.

తం: ఆ పని సావిత్రి కప్పగించేశావ్? అయితే యింక అడగక్కర్లేదు. ఇల్లు దోపిడీ అయిపోయిందన్నమాటే. అదిగో. ఏం సావిత్రీ, పని వాళ్ళందరికీ అన్నాలు పెట్టించేశావా?

హే: ఏం సావిత్రీ, అయిందా యింకా ఎవరైనా మిగిలిపోయారా?

సా: మాటలనగానే పనులయిపోతాయా హేమా....అంతా పురమాయించేవాళ్ళే. బూరెల బుట్టా అవీ పూజగదిలో ఉండిపోయాయి. పోనీ అవో రెండు అందరికీ వడ్డేద్దాం అని నేరకపోయి గదిలోకి వెళ్ళాను. వెళ్ళినందుకు శాస్తి జరిగింది.

హే: ఏం, ఏంజరిగింది?

సా: ఏదైనా జరుగుతుంది. ఆ గదిలో అత్తయ్యగారు కొంగేసుకు పడుకున్నారు. నాకేం తెలుసూ ఆ సంగతీ? బుట్టకోసం వెళ్ళాను- అదైనా నేను కూర్చుని తినేస్తానా బుట్టెడు బూరెలూ!

తం: అబ్బబ్బబ్బ. ఆ సోదంతా యిప్పుడు దేనికే? జరిగిందేదో సరిగ్గా చెప్పకూడదూ.

హే: సరిగ్గా చెప్ప సావిత్రీ, ఏం జరిగింది?

సా: అంటే ఏమిటీ నీఉద్దేశం? నాకు మాట్లాడ్డంకూడా చాత కాదనా? నీఅంత తెలివైనదాన్ని కానుమరి. ఏంచేస్తాం. ఇప్పుడనుకొని ఏంలాభం?

హే; అవునులే. ఎలాగయితేనేం చదువుకున్నదానివి బయలు దేరావు.గడియగడియకీ నువ్విలా దెప్పి పొడిస్తే నేను పడను. తెలిసిందా?

సా: ఎవరేమన్నా నేనే నోరుమూసుకు ఊరుకోవాలి. అంతేనా నువ్వన్నది?

హే: నిన్నేమన్నాను నేను?

సా: ఆ గదిలో కెళితే ఆవిడగారి మూలుగు, ఇక్కడ కొస్తే చీవాట్లు, ఇంక నేను ఏ గంగలో దిగేది?

తం: అబ్బబ్బబ్బ, పరమేశ్వరా! ఎలా బతుకుతారర్రా మీరూ? అసలు సంగతేమిటో చెప్పకుండా....

సా: చెప్పడానికి ఏవుంది మామయ్యగారూ. అత్తయ్యగారు పూజ గదిలో కొంగేసుకు పడుకొని ఎందుకో ఏడుస్తున్నారు.

తం: (ఉద్రేకంగా) ఏడుస్తోందీ, శుభమా అని కొంపకట్టుకుని గృహప్రవేశం చేసుకుంటే తీరి కూర్చొని ఏడుస్తోందీ? ఏం?

సా: అదేమో, నాకేం తెలుసు? ఇదంతా నా ఖర్మ.

హే: పోన్లే యిప్పుడేంచేస్తావుమరి! హద్దూ పద్దూ ఉండాలి నోటికి!

తం: ఏడవనీ, ఏడవడం దానికి సరదాగావుంది గావును, ఏడుస్తోంది. ఆ ముచ్చటా తీరనీ, మధ్య నాకేం? హాయిగా కొత్తింటి గదీ, చల్లని గచ్చూ, గాలీ వెలుతురూ-కూర్చొని ఏడవడానికి సదుపాయంగానే ఉంటుంది!

హే: అదేమిటి నాన్నగారూ అలా అంటారు?

తం: అలా అనకపోతే యింకెలా అనమంటావ్? పోనీ నువ్వెళ్ళి కనుక్కురా, ఆవిడగారికి ఏమికావాలో.

సా: వంటింట్లో ఏవుంటే అవే వేసి పనివాళ్లకి భోజనం పెడతాను, అనక వాళ్ళు దెబ్బలాడితే నన్నని లాభంలేదు.

హే: నీ యిష్టంవచ్చినట్లు చెయ్యి తల్లీ. నిన్నడ్డేవాళ్లెవరు? ఈ కొంపలో అందరూ స్వతంత్రులే, నేనూ అమ్మా తప్ప. నేను వెళ్ళి అమ్మను చూస్తాను.

తం: అన్నట్టు రొంటిలో రూపాయేది చెప్మా, ఆఁ....గోపాలం తీసుకున్నాడు. ఏడీ వాడూ, అప్పుడే ఆ రూపాయి కాస్తా తగలబెట్టేసి ఉంటాడు. ఒరేయ్ గోపాలం. (అని అరుచుకుంటూ వెళతాడు.)

శి: (దూరంనుండి వస్తున్నట్టు) హేమా-నువ్వా సావిత్రీ. హేమేదీ?

సా: (చిరాగ్గా) మీ హేమని కొంగుకి ముడేసుకు తిరగటం లేదన్నయ్యగారూ. అత్తయ్యా ఆవిడా పూజగదిలో ఉన్నారు.

శి: చూశావా, అదీవరస. పోతానంటే పోనివ్వరు, ఉంటే నా మాటెవ్వరూ వినిపించుకోరు, ఏందారి?

సా: ఇప్పుడేం కావాలి మీకూ? ఈ యింట్లో ఒకళ్ళమాట ఒకరు వినిపించుకోరు. ఎవళ్ళ స్వార్థం వాళ్ళు చూసుకుంటారంతే.

శి: కరెక్టుగా చెప్పావు. పాతికవేలు తగలబోసి యిల్లు కట్టారా మావగారు—!

సా: ఇవాళ ఖర్చుల్తో కలిసి అంతా ముప్పైరెండు వేలయిందట, ఇందాక మావగారు అల్లా యినస్పెక్టరుగారితో చెపుతున్నారు.

శి: నేను నమ్మను. అదంతా మనల్ని ఇంప్రెస్ చెయ్యడానికి అనే మాటలు. ఇంతోటి తాజ్‌మహల్‌కి అన్నివేలు దేనికి? పోనీగాని యీ మాత్రం యిల్లు కట్టుకున్నారా. ఓ పద్ధతీ అదీ ఏంలేదు. ఓ డ్రాయింగ్ రూమ్ లేదు. పట్టుమని నాలుగు కుర్చీలు లేవు, ఎలక్ట్రిక్ బల్బులు కాస్త మంచివి పెట్టించడానికి కూడా పిసినారితనమే.

సా: మామగారితో చెప్పకూడదూ, మీకేం కావాలో అడిగితే సరి!

శి: అందుకే ప్రయత్నిస్తున్నాను, పగలల్లా పురోహితుల మంత్రాల తోటీ, భోజనాల హడావుడితోటీ చెవులు హెూరెత్తిపోయాయి. సాయంత్ర మేనా ఏదైనా కాస్త మంచి ఎంటర్ టైన్‌మెంట్—

సా: మంచి హరికథ పెట్టిస్తేసరి. అత్తయ్యగారు సంతోషిస్తారు. వస్తా - అవతల పనివాళ్ళందరికీ అన్నాలు పెట్టాలి.

(శివరావు "హేమా, హేమా, హేమా"....అని పిలుస్తూ వెళతాడు.)

తల్లి: నా కర్మకి నన్నాదిలేద్దూ హేమా. అంతా నన్నుద్ధరించే వాళ్ళే.

హే: అలా అంటే ఎలాగమ్మా. అసలేం జరిగిందో చెప్పకూడదా?

త: మొదట్నించీ అనుకుంటూనే ఉన్నాను, తెల్లారి లేచింది మొదలు అన్నీ అపశకునాలే, గాడిపొయ్యిదగ్గర తడక అంటుకున్నప్పుడే అనుకున్నాను-ఏదో మూడుతుందని. (సన్నగా ఏడుస్తున్నట్టు మూలుగు తుంది)

హే: అందుకా ఏడుస్తున్నావు?

త: ఒకందుకేవిటీ, అన్నిటికీ ఏడుస్తున్నాను. ఏ ముహూర్తాన మీ నాన్నగారు యీ కొంప కట్టడం తలపెట్టారోగాని—

హే: అవన్నీ ఎందుకమ్మా యివ్వడూ? ఇవ్వడేంవచ్చిందనీ?

త: జరిగిపోయిందీ, అఘాయిత్యం జరిగిపోయిందీ.

గో: (ప్రవేశిస్తూ) అఘాయిత్యం ఏమిటీ? ఏమిటి హేమా యీ గొడవ? నాన్నగారు చెపితే నమ్మలేదు. ఏమిటమ్మా?

హే: అదే యిందాకటి నుంచీ అడుగుతున్నా నన్నయ్యా, నాలిక పీక్కున్నా చెప్పడంలేదు. ఏమిటో అపచారం జరిగిపోయిందంటుంది. ఏమిటంటే ఏడుస్తుంది.

గో: బాగుందమ్మా వరుస!

త: నీకేం బోయింది నాయనా. గాలిపటంలా ఊరంతా తిరిగి తిరిగి వస్తావూ.

గో: నేనేం సరదాకి తిరగలేదు. నీ పనిమీదనే అలా వెళ్ళొచ్చాను. ఇంతకూ అసలు సంగతేమిటో చెప్పకుండా యిలా సాధిస్తే ఎలాగ?

త: ఆ వెంకటేశ్వర్లు దీపారాధనా పడనిచ్చారు గారు. నాన్నగారి నడిగితే యింకోమారు చూసుకుందాంలే అంటారు. ఇంతకూ యిదంతా ఆ పురోహితుడివల్ల జరిగింది. ఆ సమయానికి నా కేమిటో మతిపోయింది. లేకపోతే అలా జరగనిచ్చేదాన్నా?

(దూరంనుంచి "హేమా, హేమా, హేమా" అని శివరావు పిలుస్తాడు)

హే: ఒరే అన్నయ్యా, ఇక్కడేఉండు, అమ్మ ఏదైనా చెపుతుం దేమో. ఆయనెందుకో అలా గావుకేకలు వేస్తున్నారు. చూసొస్తాను.

గో: త్వరగా వెళ్లు. లేకపోతే పారిపోతానని బెదిరిస్తాడు, నిన్నటిలా.

హే: బెదిరిస్తే నిక్షేపంలాగ వెళ్ళమంటాను. నాకేం భయమా? మీరే భయపడ్డారు నిన్న. ఒస్తానుండూ.

త: గుండెల్లో కుంపటిలాగ ఆ అల్లుడుగారొకరు! ఎప్పటికైనా దారిలోకొచ్చి బాగుపడతాడో లేదోగాని.

గో: నీకెప్పుడూ ఏదో ఒకటి తలుచుకుని ఏడవడం సరదాలా ఉంది. ఏం జరిగిందో చెప్పమంటే యీ సోదంతా దేనికే?

త: ఏం? పెళ్ళాంమాటలు విని నీక్కూడా నన్ను చూస్తే చికాకేస్తోందా?

గో: మధ్య దాని గొడవెందుకూ, నీ సంగతేమిటో చెప్పమంటే?

సా: (ప్రవేశిస్తూ) అత్తయ్యా! ఇప్పుడైనా ఆ బూరెలబుట్ట పట్టికెళ్ళనా? అవతల పనివాళ్లు మధ్య నన్నంటున్నారు, నేనేదో ఈ పెట్టుపోతలకి అడ్డొస్తున్నానని.

త: తీసికెళ్ళు మా తల్లీ, తీసికెళ్ళు. అన్నీ తీసికెళ్ళి పంచెయ్. మధ్య నా పెత్తనం ఏవుందీ. నీ యిష్టం వొచ్చినట్టు చెయ్యి.

సా: చూశారండీ! మధ్య నేనేం అన్నానూ? కావలస్తే మీరు ఒకసారొచ్చి వినండి, పనివాళ్లు ఎంతలేసి మాటలంటున్నారో. అంత చాకిరీ చేయించుకుని గృహప్రవేశంనాడైనా కాస్త కడుపునిండా భోజనం పెట్టకపోతే ఎలాగంటున్నారు!

త: చూశావా. చూశావా. ఎంతలేసి మాటలంటోందో!

గో: (చిరాగ్గా) ఆ అపచారం ఏమిటో చెప్పవమ్మా అని నే నేడుస్తున్నాను. నీకోసమని నేను చచ్చిచెడి అవతల అన్ని ఏర్పాట్లూచేస్తే....

త: చేశావు ఏర్పాట్లు! అందుకే కాబోలు చివరకి యిలా అయింది! అవకతవక ముహూర్తం అవకతవక తంతూ-అతి ముఖ్యమైనదే మరచిపోయారు. ఆ పురోహితుడైనా జ్ఞాపకం చేశాడు గాదు. మీ నాన్నగారు సరేసరి, ఓ కానీఖర్చు తగ్గిందే చాలుననుకుంటారు. కానీ, అనుభవిద్దాం. లేకపోతే యిదంతా సంసారం బాగుపడ్డానికొచ్చిందా?

తండ్రి: (ప్రవేశిస్తూ) ఎలా బాగుపడుతుంది? ఇంటి యిల్లాలు యిలా కాళ్లు చాచుకొని తీరుబడిగా నట్టింట్లో ఏడుస్తుంటేనూ....ఎలా బతుకుతార్రా బాబూ మీరంతా.

త: అనండి, అనండి. అలాగే అనండి. నోటికి యిష్టం వచ్చినట్టు అనండి. పొద్దున్న గాడిపొయ్యి దగ్గిర తడిక నిప్పంటుకొందా, ఆ తరువాత కోడలు శుభమా అని చీర కొంగుకి నిప్పెట్టేసుకుందా?

గో: అదేమిటి? ఏమిటది సావిత్రీ?

సా: ఆవిడగారు ఏదైనా చెప్పే పద్ధతి అంతే లెండి. పొద్దున్న దేవుడి దగ్గిర దీపాలు వెలిగిస్తుంటే పొరపాటున అగ్గిపుల్ల చీర కొంగుమీద పడింది. వెంటనే దులిపేశాను. దాన్నే ఆవిడ పెద్ద ఫైర్ ఏక్సిడెంట్‌లాగ మాటాడుతున్నారు.

తం: అయిందీ. నిక్షేపంలాంటి కొత్త చీర అంటించేశావ్? నలభై రెండు రూపాయలుపోసి కొన్నాను, ఒకటీ రెండూ కాదు.

సా: మానెయ్యలేక పోయారా? కొనమని నేనేం బతిమాలలేదే?

త: చూశారా? ఇదీ వరస. దీని మూలానే అంత అఘాయిత్యం జరిగింది. కావాలనే చేసుంటుంది. కానీండి, దేవి శపిస్తుంది. అంతేనా!

తం: ఏ దేవి?

త: మీరూ అలాగే మాటాడతారేమండీ. కళ్ళు పేలిపోవూ? ఇన్ని వేల రూపాయలు మంచి నీళ్లలా ఖర్చుపెట్టి కొంప కట్టించారు, గృహ ప్రవేశం చేయించారు. సరిగ్గా సమయానికి అందరం యిలవేల్పునే మరచిపోయాం.

తం: ఏం? కామేశ్వరీ పూజ జరగలేదూ?

త: ఎక్కడ జరిగింది? నా ఏడుపల్లా అదే. ఈ కుర్రకారు కేం పోయింది? మీ బుద్ధి నా బుద్ధి ఎక్కడికి పోయిందట? మన వంశానికి యిలవేల్పు కామేశ్వరి గదా? కామేశ్వరీ పూజ జరక్కుండా ఏ తంతైనా జరిపించొచ్చా? బెడిసి కొట్టదూ?

తం: అదేమో నాకేం తెలుసు? ఆ పురోహితుడు ఏదో చేశాడు. అన్నీ సరిగ్గానే అఘోరించా డనుకున్నాను. ఎంతసేపూ కానీ ఇయ్యి అణా ఇయ్యి అంటాడేగానీ—

త: అంతా అయాక జ్ఞాపకం వచ్చిందని నాకు. హడలిపోయాను. పోనీ మళ్ళీ పూజ చేయిద్దామని చూస్తే, విగ్రహంకూడా ఎక్కడా కన బడ్డంలేదు. ఇంటి కోడలవు గదా! ఎంత చదువుకొన్నదానివైనా-నీకైనా ఆ మాత్రం జ్ఞానం ఉండొద్దూ?

సా: మధ్య నామీద విరుచుకు పడతారేమిటి? నేనేం చేశాను? మీ యిలవేల్పు కామేశ్వరని నేనేం కలగన్నానా?

తం: ఆఁ....అది కూడా తెలీదా నీకూ....లేకపోతే నువ్వే మా యిలవేల్పు వనుకున్నావా?

త: పోనీ-చచ్చి చెడి యిల్లంతా వెతికాను. ఆ విగ్రహం ఏం చేశారు? ఎక్కడా కనబడదేం? దేవుడి సింహాసనంతో పాటు ఇదీ తెచ్చాను. నాకు బాగా జ్ఞాపకం. ఏవయింది?

సా: ఎలా ఉంటుంది ఆ విగ్రహం? ఇత్తడిదేనా? బరువుగా ఉంటుందీ! పోత విగ్రహం అజంతా అప్సరసలా ఉంటుందీ!

త: అవన్నీ నాకు తెలియదే తల్లీ! కాని సరిగ్గా అదే! దానికోసమే వెతుక్కు చస్తున్నాను. ఏదీ అది?

సా: అది మీ అల్లుడుగారు ఆయన గదిలో టేబులుమీద పెట్టు కున్నారు.

త: అయ్యొయ్యొ, కళ్ళు పేలిపోవుటే. అతగాడి కెలా దొరికిందదీ?

సా: అవన్నీ నాకు తెలియదు. అక్కడ చూశాను.

తం: వెర్రి కుదిరింది రోకలి తలకు చుట్టమన్నాట్ట.

శి: (ప్రవేశిస్తూ) ఎవరు మామగారూ?

తం: మరెవరు? నాయనా? సాక్షాత్తూ నువ్వే. పూజలోని కామే శ్వరి విగ్రహం కాస్తా తీసికెళ్ళి షోగ్గా నీ టేబులుమీద పెట్టుకున్నావా?

శి: కామేశ్వరా? అంటే?

తం: అదేనోయ్, నీ టేబులుమీద యిత్తడి విగ్రహం.

శి: దాని సంగతెందు కొచ్చిందిప్పుడూ?

తం: ఆ విగ్రహం నీ టేబులుమీది కొచ్చిందెప్పుడూ? ఆ సంగతి చెప్పు ముందు.

శి: ఇవాళ ఉదయం సామానూ, ఫర్నిచరూ అంతా ఎరేంజి చేస్తుంటే కనబడిందీ!

త: బాగుంది నాయనా వరస. అది మా యిలవేల్పు కామేశ్వరి విగ్రహం.

శి: దీన్నే పామరత్వం అంటారు. కామేశ్వరేమిటి? ఏదో పాత కాలపు ఇత్తడి బొమ్మ. ఏ చాళుక్యుల నాటిదో, పల్లవుల నాటిదో అయుంటుంది. ఆర్నమెంటల్‌గా ఉంటుందని టేబిలు మీద పెట్టాను, అదీ తప్పే?

హే: (ప్రవేశిస్తూ) ఏమిటి? తప్పేమిటి? ఏమిటండీ అదీ?

త: ఆఁ....ఏవుందీ. మీ ఆయన నిర్వాకం. కామేశ్వరి విగ్రహాన్ని కాస్తా తీసికెళ్ళి టేబులుమీద పోగ్గా పెట్టాడు, ఏం బెడిసికొడుతుందో ఏమిటో.

హే: ఏమీ బెడిసికొట్టదు. మనుముల ప్రయోజకత్వాలు యిలా బెడిసి కొట్టగా లేంది యింక దేవుళ్లు చెయ్యగలిగింది ఏవుంది? అవును గాని, ఏరా అన్నయ్యా నువ్వెవరినైనా హరిదాసుని రమ్మన్నావా?

గో: అవును. ఏం ఒచ్చాడా?

హే: ఆఁ. అరుగుమీద తిష్ఠవేసి కూనిరాగం తీస్తున్నాడు. వెళ్ళు. ఫిడేలు వాడికీ మద్దెల వాడికీ కబురు పెట్టాలంటున్నాడు.

తం: హరిదాసా? రామాయణంలో పిడకల వేటలాగ వాడెందుకూ మధ్య?

గో: నేనే రమ్మన్నాను నాన్నా. గృహప్రవేశంనాడైనా ఓ వేడుకా, వినోదం ఉండొద్దూ. అమ్మకి హరికథలంటే యిష్టం.

తం: ఇంకా ఏవంటే యిష్టం? యిల్లు గుల్లయిపోవడం యిష్టం. మీనాన్న ఫకీరయిపోవడం యిష్టం. ఏం?

త: ఎందుకురా నాయనా. లేనిపోని బెడద అంతా పెట్టుకున్నావు! నాన్నగారి ధోరణి నీకు కొత్త గనకనా. ఓ యిహమా, పరమా—డబ్బే కైలాసం. అయ్యో రామ, పొమ్మనవే హేమా వాణ్ణి! అంతా పొరపాటు నాయనా వెళ్ళిరా అను!

గో: బాగుందివరస. వాసుగారంటే అల్లాటప్పయ్యనుకున్నావాఏం?

తం: ఎవడట గానీ. ఒక్క కానీ యియ్యను నేను. హరికథలే పెట్టిస్తారో డాన్సులే పెట్టిస్తారో అంతా మీ యిష్టం.

సా: అత్తయ్యా! ఇంకా ఎనమండుగురు పని వాళ్లు మిగిలి పోయారు భోజనాలకి. పొమ్మన్నాను ఇంక నేను పడలేను ఆ బాధ.

త: ఏమిటీ? పొమ్మన్నావూ? మధ్య నువ్వెవర్తివి పొమ్మనడానికీ, రమ్మనడానికీ?

సా: పొమ్మనక ఏం చెయ్యను మరి? ఏ సంగతీ పట్టించుకో కుండా పిండివంటల బుట్టలన్నీ పేర్చుకుని యీ గదిలో అలకపాన్పు వేసుకున్నారు.

గో: సావిత్రీ ఏమిటా మాటలు!

సా: మీరుండండి మధ్య.

త: పిండివంటలు నా యిష్టమొచ్చిన వాళ్ళకి యిస్తాను. లేని వాళ్ళకి మానేస్తాను. నా యిష్టం. అడగడానికి నువ్వెవరూ అంటా!

సా: సరే అయితే. ఇంక నేనెవరికీ భోజనాలు పెట్టను. అది నా యిష్టం. సరేనా?

త: వీల్లేదు.

సా: మీరు వెళ్ళి పెట్టండి వీల్లేకపోతే. గడియకోలాగ మాటాడితే ఎలాగ?

త: అదంతా వేరే సంగతి, వెళ్ళి వాళ్ళందర్నీ ఉండమనిచెప్పు.

సా: నేను వెళ్ళమన్నాను అందర్నీ. ఆ తరువాత మీరు ఏవట చేసుకోండి. ఏం, నా కామాత్రం స్వతంత్రం లేదా యీ కొంపలో, ఏవండీ మీరు మాటాడరేం? బెల్లంకొట్టిన రాయిలా అలా నించుండిపోతే ఎలాగ? ఛీ ఛీ. ఈయింట్లో ఒక్కక్షణం వుండను నేను.

గో: సావిత్రీ సావిత్రీ. (అని అరుచుకుంటూ దూరంగా పరిగెడ తాడు. అట్లాగే మళ్ళీ దగ్గరగా వస్తాడు 'సావిత్రీ' అనుకుంటూ) సావిత్రీ ఏమైనా బాగుందా? ఈ దురుసుతనం ఏమిటీ, ఈ అలక ఏమిటీ? ఎవ రైనా వింటే నవ్వరూ. ఏమనుకుంటారు?

సా: (క్రమంగా దుఃఖం వచ్చేసి, ఏడుస్తూ) అనుకోనీండి. ఇదంతా నా ఖర్మ. ఏ పూర్వ జన్మలోనో ఏదో పాపం చేశాను. ఈ కొంపలోకి వచ్చి పడ్డాను. మిమ్మల్నని ఏం లాభం! నా గొంతుక్కోశాడు మానాన్న. కానివ్వండి (ఏడుస్తుంది.)

గో: కాస్త నామాట వినిపించుకోవా? అయినదానికీ కానిదానికీ ఈ ఏడుపు దేనికీ?

సా: ఇంకేదీ చేతకానప్పుడు ఏడవడానిక్కూడా హక్కులేదా? ఆవిడలా నానామాటలూ అంటూంటే నోరు మూసుకు పడవలసిందేనా?

గో: పెద్దది ఆమాత్రం ఆవిడ అననూవచ్చు. నువ్వు పడనూవచ్చు.

సా: (ఉద్రేకంతో) నాకేం అవసరంలేదు, తెలిసిందా? మీ కొంపలో నేనేం దాసీదాన్ననుకున్నారా? పనివాళ్ళని పొమ్మనడానికీ రమ్మన డానికీ కూడా హక్కులేదా నాకూ? పైపెచ్చు ఆవిడని వెనకేసుకు వస్తారా? సిగ్గులేదూ?

గో: అతిగా పేలకు. మళ్ళీ మాట్లాడితే పళ్లు రాలిపోతాయి జాగ్రత్త.

సా: అంతేగా మీ ప్రయోజకత్వం? ఇందుకా నామెళ్ళో పుస్తికట్టింది మీరు? ఓ వేడుకా వినోదం లేదు, సరదాలేదు, ముద్దూ ముచ్చటా లేదు.

పౌరుషానికి మట్టుకు లోటులేదు, ఏం? ఇంకీనరకంలో ఒక్కక్షణం ఉండను నేను. పంపించెయ్యండి. తక్షణం మా పుట్టింటికి పోతాను నేను, (ఏడుస్తూ) అమ్మా, అమ్మా ఇందుకా అమ్మా నాకీ పెళ్ళి చేశావు నువ్వు? ఇప్పుడే గంగలో దిగనమ్మా, అమ్మా అమ్మా....(ఏడుస్తుంది.)

గో: ఏ గంగలోనేనా దిగు. ఇదిగో యిప్పుడే వెళ్ళి జట్కా తీసుకొస్తాను. పెట్టి సర్దుకో. పద రైలుస్టేషనుకి! ఛీ, ఛీ ఏం సంసారం ఏం సంసారం!

* * *

శి: హేమా, హేమా! ఒక్కసారి ఇలా చూడు, ఇంత గొడవవుతుందనుకో లేదు హేమా నేను, ఏదో మామూలు ఇత్తడి బొమ్మనుకుని— వినవా, హేమా?

హే: (ఉద్రేకంగా) ఏం వినడమండీ నా ఖర్మ. తెల్లారిలేస్తే ఏదో గొడవ, ఏదో పితూరీ, నలుగురిలోనూ నాకూ తలవంపులు. అసలే అమ్మకి చాదస్తం ఎక్కువ. ఎంతసేపూ నోములూ, వ్రతాలూ దేవుళ్ళూను—యివతల మనుషులు చచ్చారో బతికారో అక్కర్లేదు, అందులో కామేశ్వరి మా పుట్టింటి యిలవేల్పూ కులదేవతానూ, ఆ విగ్రహమా దొరికింది మీకు!

శి: నామాట వినిపించుకోవేం హేమా, ఏదో కొత్తయిల్లూ-కొత్తగదీ- అదేదో బొమ్మనుకున్నానుగాని-

హే: ఏం అనుకోవటం అండీ, తెల్లారిలేస్తే చేసే పనులన్నీ అపసవ్యం పనులేనా? ఎన్నాళ్ళీలా హీనంగా బతకడం. (క్రమంగా ఏడుస్తూ) ఎప్పటికైనా మనకీ ఓ యిల్లూ సంసారం, ఏర్పడి నలుగురిలోనూ తలెత్తుకు తిరుగుదామనీ ఆశ పెట్టుకున్నాను, రోజులు గడుస్తున్నకొద్దీ మిమ్మల్ని చూస్తుంటే గుండె తరుక్కుపోతోంది. అంతే, యీ జన్మకీ ఘటం యిలా వెళ్ళవలసిందే. (ఏడుస్తూ) అమ్మా, అమ్మా ఇందుకా నాకీ పెళ్ళి చేశావు నువ్వు, ఎన్నాళ్ళీ సంసారం. ఇప్పుడే గంగలో దిగను అమ్మా! (దుఃఖం పొంగివచ్చి ఏడుస్తుంది.)

తం: (పెళ్ళాన్ని పిలుస్తునట్టు) ఇదిగో చూశావా! అరె! ఇంకా ఏడుస్తూనే ఉన్నావా? ఇందాకటి పాత ఏడుపేనా యిది లేకపోతే కొత్తగా యింకేదైనా కారణం దొరికిందా? (కోపంగా) మాటాడవేం?

త: (ఏడుపు గొంతుకతో) ఆనండనండి. పొద్దున్నించీ అన్నీ అపశకునాలే. వాటికే బెంగపెట్టుకుని వెయ్యి దేవుళ్ళకి మొక్కుకుంటూంటే! అనండనండి అందరికీ నేనే లోకువ. సావిత్రికే లోకువయాక మీకవనూ. అంతా నాఖర్మ. ఈ గండం తప్పించు తండ్రీ! ఏడుకొండలవాడా! (ఏడుస్తుంది.)

తం: ఏడువ్, తీరిగ్గా పడుక్కుని నీ యిష్టం ఒచ్చినంతసేపు ఏడువ్, (గట్టిగా) ఒరేయ్ గోపాలం, గోపాలం (అని పిలుచుకుంటూ దూరముగా వెళ్లి మళ్ళీ దగ్గరగావచ్చి) గోపాలం ఏడీ సావిత్రీ? అరె! నువ్వూ యీ గదిలో కూర్చుని ఏడుస్తున్నావా? సరే. తీరిగ్గా కూర్చుని ఏడువు, మా చిట్టి తల్లీ. హేమా, హేమా....(అని అరుచుకుంటూ వెళ్లి అలాగే మళ్ళీ దగ్గరగావచ్చి) ఏడీ హేమా నీ శకారుడు....అరే. నువ్వూ ఏడుస్తున్నావా? అదీ సబబుగానే ఉందిలే. ఇంటిల్లిపాదీ ఏడుస్తున్నప్పుడు నువ్వు మానేస్తే ఏం బాగుంటుంది? ఏడువ్. నలుగురితో ఏడుపు అదీ బాగానే ఉంటుంది.

(చిరాగ్గా) పరమేశ్వరా! చూస్తున్నావు గదా యిదంతా. ఇదీ సంసారం! ముప్పైనాలుగువేలు పోసి యిల్లు కట్టాను, ఎవరికి? పెళ్ళాం పిల్లలికి. మా శకారుడు దానికి ఆనందనిలయమని పేరు పెట్టాడు. గృహప్రవేశం అన్నారు. అదీ అఘోరించాం, బోలెడంత డబ్బు తగలేసి. ఏం జరిగింది చివరికి? చెమటోడ్చి సంపాదించాను....చచ్చి చెడి గంపెడంత సంసారాన్ని యీదుకొస్తున్నాను. దేనికి? ఎవరు సంతోషించడానికి? కోపంతో అందరూ తలకో గదిలో కూర్చుని ఏడుస్తున్నారు. నేనింకా బతికున్నానని! విన్నావా పరమేశ్వరా....ఇదంతా చాలక అరుగుమీద హరిదాసు. పొమ్మంటే వాడి కేడుపు, పోకపోతే నా కేడుపు, సన్యాసం పుచ్చుకుని ఏ రుషీకేశమో పారిపోవాలిగాని....

# రంగము 3

(దూరాన ఎక్కడో శ్రావ్యంగా ఫిడేలు వాద్యం వినిపిస్తుంది.)

హే: (కంగారుగా) ఏమండోయ్....బాబ్బాబూ....ఒక్కసారి లేచి చొక్కా వేసుకుంటారా?

శి: (వినిపించుకోకుండా, రాగవరసతో పరధ్యానంగా) "అంతము లేని యీ భువనమంత పురాతన పాంథశాల, విశ్రాంతి గృహంబు...."

హే: అఁ, యీ కొంపలో విశ్రాంతి అడుక్కుతిన్నట్టే ఉందిగాని.... లేవరేం?

శి: (ఇంకా ఆ ధోరణిలో) "లలనా! కోమలమైన నీ తనువు నేలన్ లీనమైపోయి, యవ్వల నానావిధ భాండభాండికల రూపంబెత్తు...."

హే: ఎత్తితే ఎత్తింది లెండి. పొద్దున్న పది గంటలకి యీ వికార వేఁమిటండీ. అర్జంటుగా బజారుకెళ్ళాలి మీరు. లెండి.

శి: ఎవరు హేమా, ఆ ఫిడేలు వాయిద్యం?

హే: మరెవరు? పక్కింట్లో జానకి. అదృష్టమంటే అలాఉండాలి. అడుగులకు మడుగులొత్తే భర్తా, వేరింటి కాపురం-పోన్లెండి-ఆ గొడవంతా యిప్పుడెందుకుగాని—

శి: జానకి! ఎంత చక్కని పేరు!

జనకస్యసుతా సీతా
రాఘవస్య విలాసినీ....

హే: (చిరాగ్గా) ఉన్న కాస్త మతికూడా యివాళ మీకు పోయి నట్టుంది.

శి: ఏమిటో హేమా. నీకూ్కడా లోకువైపోయాను చివరికి.

హే: మళ్ళీ మొదటికొచ్చారా? రాత్రంతా నిద్రమానుకుని అన్ని గంటలసేపు మీకు అన్నీ చెప్పాను గదటండీ-చిలక్కి చెప్పినట్టూ!

శి: ఒచ్చిన చిక్కల్లా అక్కడే. నీ దృష్టిలో నేనో చిలకని. నువ్వు నేర్పిన మాటలు వల్లిస్తూ బటాణీలు కొరుకుతూ-అలాపడుండాలి అంతేనా?

హే: చేతగాని పౌరుషాలు యిలాగే ఉంటాయి. ఈ గొడవంతా తరవాత మాటాడుకుందాంగాని-మహాప్రభూ....ఒక్కసారి లేచి చొక్కావేసు కోండి....అబ్బబ్బబ్బ....అవసరానికి మనిషికాదండీ మీరూ! సమయానికి ఆ గోపాలం కనబడ్డు. మీరు చూస్తే యిలాగ!

శి: ఇప్పుడేం చెయ్యమంటావు నన్ను?

హే: పురోహితుడేవో అర్జంటుగా తెమ్మంటున్నాడు. అవి లేనిదీ తంతు నడవదట. ఇదిగో లిస్టు. గప్‌చిప్‌గా మా నాన్నగారి కంటబడకుండా వెళ్ళి తీసుకురండి.

శి: డబ్బులూ....?

హే: నేనిస్తాగా....ఇదిగో పదిరూపాయల నోటు.

శి: ఇంతలో ఉంటుందేదైనా! ఇదే నా అవసరం అయితే ఒక్క దమ్మిడీ పుట్టించలేవు—

హే: బాగుందండీ వరస. అదీ యిదీ ఒకటే? ప్రాణంమీదికి ఒచ్చినంత అవసరం ఒస్తే ఏంచేస్తాం మరి? పక్కింటి జానకిగార్ని బతిమాలి అప్పు తీసుకొచ్చాను.

శి: (నిస్పృహగా) నాకంటె ఎవరైనా నయం. ఆడదైనా ఆ జానకే అదృష్టవంతురాలు నాకంటె.

హే: హరి దేవుడా. ఏం మగాళ్ళండీ మీరూ. సిగ్గైనా లేదూ అలా మాటాడ్డానికి?

శి: అదే నేనూ ఆలోచిస్తున్నాను. పోనీ హేమా-ఒక్కటి చెప్పూ-నన్ను ఒదిలెయ్యకూడదూ? హాయిగా పోతాను—

హే: ఎక్కడికి....?

శి: అనంత విశ్వంలోకి. ఆకలీ, ఆశలూ లేని ఆ లోకంలోకి.

హే: టిక్కెట్టుకి డబ్బులున్నాయా? (కాస్త కోపంగా) బుద్ధిలేక పోతే సరి. ఇంతకూ మీరు బజారుకి వెళతారా, వెళ్ళరా? అదేదో చెపితే, పోనీ నేనైనా వెళతాను.

(దూరంనుంచి హేమా అని పిలుచుకుంటూ)

సా: (దగ్గరగా వచ్చి) హేమా....సరుకు తెప్పించారా అనిఅడుగుతున్నారు అత్తయ్యగారు. పురోహితుడు తొందర చేస్తున్నాట్ట.

హే: ఏం చెప్పను సావిత్రీ. ఇందాకటినించీ బతిమాలుతున్నాను- యీ మూలవిరాట్టు కదలడంలేదు. ఏం చెయ్యమంటావు?

సా: పోనీ ఆయన్ని పంపుదామంటే - ఆయనకూడా ఎక్కడికో ఉడాయించారు.

హే: అదే వరస. ఈ కొంపలో ఎవరికీ ఏం చెప్పలేం.

శి: ఇంక చాల్లే చీవాట్లు. ఆ డబ్బూ, సంచీ యిలా పారేయ్. వెళ్లొస్తాను. తప్పతుందా మరీ.

సా: కాస్త యీమాత్రం సాయంచేసి పెట్టండి అన్నయ్యగారూ. ఈ శాంతీ గింతీ వీటిల్లో నాకేం నమ్మకం లేదుగాని—

శి: అయితే మరెందుకు యీ హంగామా అంతా?

సా: అత్తయ్యగారి కోసం. శాంతి చేయిస్తేగాని యీ కొంపకి కీడొదలదని ఆ పురోహితుడు ఆవిడకి నచ్చచెప్పాడు మరి.

హే: మళ్ళీ అదంతా ఎందుకు సావిత్రీ? రాత్రి అందరం కలసి మాటాడుకున్నదేగా? ఏమండీ....అలా గుడ్లు మిటకరిస్తూ చూడకండీ.... నాకు చిరాకేస్తుందీ! వెళ్ళిరండి త్వరగా....

శి: ఆల్‌రైట్....వెళుతున్నాను....హూ....ఖర్మగాని - నేను వెళ్ళి గసగసాలూ మాచిపత్రికొని మోసుకురావడం ఏమిటి?

హే: ఏంచేస్తాం లెండి. అంతా ఖర్మ! హాల్లో నాన్నగారి కంట మాత్రం పడకండా వెళ్ళండి....తెలిసిందా?

శి: తెలిసింది. నువ్వు చెప్పడం, తెలియక పోవడమూనా?

సా: గసగసాలూ మాచీపత్రీ అంటారేమిటి? శాంతి చేయించ డానికి అవికూడా కావాలా?

హే: నా తలకాయ. ఆయన భాషే అంత. ఏంచెప్పను సావిత్రీ. నీకు తెలియంది ఏవుందీ? ఈమాత్రం దానికి నువ్వు నామీద కోవంతెచ్చు కుంటుంటావు. ఈ కోపంలో నేనేదో సుఖపడిపోతూన్నట్టు.

సా: నువ్వూ అక్కడే పొరపాటుపడుతున్నావు ఒదినా. నా కోపం నీమీద కాదు. మధ్య నువ్వేం చేశావ్ నన్ను?

హే: అవకాశం ఉంటే యీ క్షణమే యీ కొంపలోంచి పారిపోవా లని ఉంది.

సా: అవునా?-నువ్వూ అలాగే కాస్త నన్నర్థం చేసుకుంటే, మీ అన్నయ్య వాలకం, యీ కాపరం-నువ్వే చెప్పు హేమా....అన్నయ్యగదా అని వెనకేసుకు రాకండా ఒక్క సంగతి చెప్పు. అమ్మయ్యో....ఏమిటా గంట?

హే: (నవ్వుతూ) మరేంలేదు. పురోహితుడు గంట వాయిస్తు న్నాడు-శనీశ్వరుడికి నూనె అభిషేకం చేస్తూ.

సా: నాలుగు వీసెల నూనె....ఎంత వేస్తూ....పోనీలే-యీ తంతు తోనే కాస్త కొంపలో-శాంతంటూ ఏర్పడితే....మీ అన్నయ్య చూశావా? పొద్దున్ననగా వెళ్ళారు. ఇప్పటికి మనిషి పికరులేదు.

హే: వాడంతేలే. చూస్తున్నాగా; చిన్నప్పట్నించీ అంతే వాడు. తల్లితోడూ ఏవీ అక్కర్లేదు. వాడి సుఖం వాడు చూసుకుంటాడు. అవ తల వాళ్ళ ప్రాణంపోయినా సరే.

సా: నీ కడుపు చల్లగా-ఉన్నమాట చెప్పావు. అటువంటి మనిషితో నా కాపరం....ఆలోచించు.

(హేమా, హేమా అని కేక)

హే: అదిగో నాన్నగారు పిలుస్తున్నారు. మళ్ళీ ఏదో వచ్చింది.

నాన్న: హేమా, హేమా, (ఆగిపోయి) ఇద్దరూ అలా దీపం సెమ్మాలలాగ నిలబడిపోయారు? ఏవిటా గుసగుసలు?

హే: గుసగుసలకేవుంది నాన్నగారూ? ఏదో మాటాడుకుంటున్నాం. ఏం?

నా: మాటాడుకుంటున్నారూ? అయితే కొంప మునిగిందన్నమాటే? నా ఖర్మ గాకపోతే, ఎన్నడూ లేనిది మీ యిద్దరికీ యింత పొత్తేమిటి? చూస్తున్నా - చూస్తున్నా - తెల్లారకట్లనించీ యింట్లో అంతా గుసగుసలూ, రహస్యాలూ - మళ్ళీ ఏదో పాతాళ హెూమం చేస్తున్నారు—అంతాకలిసి. నన్నిలా బతకనివ్వరు మీరు. మీ అమ్మేదీ? (గట్టిగా) ఇదిగో....

అమ్మ: (ప్రవేశిస్తూ) అబ్బ! ఎందుకండీ అంతేసి గావు కేకలూ! మీరలా అరిస్తే నాకు గుండెల్లో దడొస్తుంది. ఏవొచ్చిందిప్పుడూ? (కంఠం మార్చి) ఏవే హేమా. వెళ్ళాడా అల్లుడు?

హే: ఆఁ.

నా: ఎక్కడికి?

సా: (నవ్వుతూ) గసగసాలు తేవడానికి మావయ్యగారూ?

నా: ఆఁ. గసగసాలే? ఎందుకూ? కొంపలో గసగసా లెందుకర్రా బాబూ?

హే: ఏవిటి సావిత్రీ - నువ్వు మరీని....గసగసాలూలేవు ఏం లేవు నాన్నగారూ. ఊరికే అంటోంది సావిత్రి. మాకేం మతిలేదనుకున్నారా గసగసా లెందుకు యిప్పుడూ?

నా: అదే నేనూ అడుగుతూంట. అవెందుకు తెమ్మనారే యిప్పుడు వాణ్ణి?

తల్లి: అయ్యో రామ....వినిపించుకోరేం ఖర్మం! గసగసాలు తెమ్మంలేదండీ....

నా: మరేం తెమ్మన్నారూ? సాంబ్రాణా? గుగ్గిలమా? దుంప రాష్ట్రమా? ఏమిటి-ఫలానా అనిచెప్పి ఏడవకూడదూ? అదుగో వీడొ కడూ.... ఎక్కడెక్కడో రాచకార్యాలు చక్కబెట్టుకొని యిప్పుడే కొంపకి చేరుకొంటున్నాడు. ఏరా గోపాలం?-ఆ రంపంపొట్టు సంగతి ఏంచేశావ్?

గో: మొదలూ? కొంపలో అడుగు పెట్టానో లేదో అప్పుడే ఏదో తుఫాను. మళ్ళీ ఏమొచ్చింది హేమా?

నా: అడిగినదానికి సమాధానంచెప్పరా ముందూ? రంపంపొట్టు సంగతి ఏం చేశావ్?

గో: ఏం చెయ్యలేదు నాన్నా. ఆ రంపంపొట్టు ముట్టుకోవద్దంది అమ్మ. ఎవరికో మాటయిచ్చిందట.

నా: అవునా....?

అమ్మ: అవును. పురోహితుడు అడిగాడు.

నా: ఎంతకీ?

అ: ఎంతకేవిఁటి?

నా: (కోపంగా) అంటే బస్తాకి ఎంతిస్తానన్నాడూ అని....బజా రులో బస్తా మూడున్నర అమ్ముతోంది.

అ: అదేమో....అదంతా నాకు తెలీదు. రంపంపొట్టుకూడా అమ్ము కుంటారా ఖర్మ. ఏదో పాపం నోరుతెరిచి అడిగాడు-అలాంటివాళ్ళకిస్తే పుణ్యా వేఁనా ఉంటుంది.

నా: ఆఁ....ఆఁ....ఇచ్చేశావూ? మూడు బస్తాల రంపంపొట్టు— బంగారంలాంటి రంపంపొట్టు—ముప్పైనాలుగువేలుపోసి కొంపకడితే మిగ

లింది అదే—అదికాస్తా నువ్వు దానం చేసేశావా? పరమేశ్వరా....ఎలా బతుకుతార్రా మీరూ? నన్ను పూర్తిగా ఫకీర్ని చేస్తేగాని మీకు నిద్ర పట్టదు.

గో: పోనీలే నాన్నా. వెధవ రంపంపొట్టుకి కూడా ఇంత రాద్ధాంతం చేస్తే ఎలాగ? తెల్లారిలేస్తే ఏదో ఒక గొడవ.

నా: గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించిందన్నట్టు - నువ్వు నాకు చెప్పొచ్చావుట్రా? ఆ రంపంపొట్టులో ఒక్కతులం ఎవ్వరికీ యివ్వడానికి వీల్లేదు....విన్నే....వినబడిందా?

అ: వినబడింది. మీ దయవల్ల నాకింకా చెవుడు రాలేదు. హేమా నువ్వొక్కసారి పూజగదిలోకి వెళ్ళు—యిప్పుడే వస్తున్నాను.... తెలిసిందా?

హే: తెలిసిందమ్మా....వెళుతున్నాను. ఆయనొస్తారేమో కాస్త—

సా: నేం చూస్తాలే హేమా - నువ్వు పూజగదిలోకి వెళ్లు.

అ: కాపరానికి వచ్చిందగ్గర్నుంచీ చూస్తున్నాను. ఒక్కలా ఉంది వరస.

నా: (ఆశ్చర్యంగా) తెలిసిందీ? నువ్వేమో ఆ శకారుడు వస్తాడేమో చూస్తావూ? ఏఁవిటి చెప్మా-యిదంతా? ఏమిరా గోపాలం? ఏవిట్రా యిదంతా?

గో: ఏవుంది నాన్నగారూ? అలా ఏదిమాటాడినా తప్పట్టుకుంటే ఎలాగ? ఇంట్లో ఆడవాళ్ళకి ఏవో వాళ్ళగొడవలు వాళ్ళకుంటాయి. ఇలా అన్నింట్లోనూ జోక్యం చేసుకుంటే ఏం దారి? మనసంగతేదో మనం చూసుకోవాలిగాని!

నా: ఎప్పణ్ణించిరోయ్ నీకీ బుద్ధి? ఏవిఁటీ-కొంపలో అందరికీ ఒక్కసారిగా యింతపొత్తు ఒచ్చేసిందీ? ఏదో ఉంది గమ్మత్తు (క్రమంగా స్థాయి

హెచ్చిస్తూ) అందరూకలిసి ఏదో పన్నాగం పన్నుతున్నారు-ఇల్లు గుల్ల చెయ్యడానికి....నన్ను ఫకీర్ని చెయ్యడానికి....

అ: ఒరే గోపాలం....

గో: ఏవఁమ్మా....

అ: నీకు పుణ్యంవుంటుందీ-నన్ను ఏ కాశీయో రామేశ్వరమో పంపి చేద్దూ నాయనా. నేను పడలేనురా యీబాధ. ఇంకీ కొంపలో ఉండలేనురా.

నా: మహారాజులా వెళ్ళు. నాకేం భయమా? కాశీయే వెళతావో, రామేశ్వరమే వెళతావో-నీ యిష్టంవొచ్చిన చోటికి వెళ్లు. కొంత తిండి ఖర్చు అయినా తగ్గుతుంది. పరమేశ్వరా....నేరకపోయి కట్టించానుగాని, యీ కొంప....

అ: సరిగ్గా నా ఏడుపూ అదే. ఏతల్లి శాపమోగాని కొంపకి పునాది రాయి వేసింది మొదలు సంసారంలో ఏడుపులూ పెడబొబ్బలూ తప్ప మరేంలేవు. మీ బుద్ధికి ఎంత తోస్తే అంతేగాని-యింటి యిల్లాల్నిగదా పోనీ-యింకా బతికే ఉన్నానుగదా - ఒక్క విషయంలోనైనా నా సలహా అడగడం....

నా: అదొక్కటే తక్కువ. ఇంత బతుకూబతికి చివరకి ఆడదాన్ని సలహా అడగాలి. మానాన్న చెప్పినట్టు, ఆడదాన్ని సలహా అడిగేకన్న సన్యాసం పుచ్చుకోవడం మేలు....

అ: పోనీలెండి — అనుభవిస్తారు నాకేం....నాడేచెప్పాడు పురోహితుడు.

నా: వాడొకడూ నా పీకలమీదికి....ఏం చెప్పాడు?

సా: నేం చెప్తావినండి మావఁయ్యగారూ ....

అ: (వారిస్తున్నట్లుగా) సావిత్రీ....

సా: ఫరవాలేదత్తయ్యా. ఎన్నాళ్ళీ దాపరికాలు? చెప్పేద్దాం పీక తీసేస్తారా....ఏం?

నా: అనుకుంటూనే ఉన్నాను - ఏదో పాతాళహోమం ఉందని. అయిందీ? కానీ....చెప్పూ....నువ్వో చిట్టితల్లివి....మా వంశాన్ని ఉద్ధరించడానికి వచ్చావు—

సా: ఈ సంబంధంకోసం నేనేం తపస్సు చెయ్యలేదు. మా నాన్న కాళ్ళావేళ్ళాబడి బతిమాలిందెవరో, యీ పెళ్ళి చెయ్యడంకోసం నానా అబద్ధాలూ ఆడిందెవరో-జ్ఞాపకం తెచ్చుకుంటే సరి.

నా: ఆహాఁ, అంతవరకూ వచ్చావూ? అయితే చదివిన చదువు వొంటబట్టిందన్నమాటే. అలా వస్తాయించి చూస్తావేరా గోపాలం?

గో: ఏం చెయ్యమంటారు నాన్నగారూ? నా కసలు పెళ్లొద్దు మొర్రో అంటే విన్నారా?

నా: నేను వినలేదంటావేమిట్రా ఖర్మ? నా పెళ్ళినాడు మా నాన్న విన్నాడా?

అ: ఎంత అఘాయిత్యం....హరిహరీ....ఆ నోటి కేమైనా హద్దూ పద్దూ ఉందా?

సా: ఎవళ్ళ పెళ్ళినాడూ ఎవళ్ళనాన్నా వినడు. వింటే మన సంసారాలు యిలా ఎందుకేడుస్తాయి? అందుకే—నేను చెప్పలేదత్తయ్యా రాత్రి మీతో, అసలు బాధ మనుషులతో. ఆ విషయం వొదిలేసి కొంపకీ-దూలాలకీ శాంతిచేయిస్తే ఏం లాభం?

నా: (ఉలిక్కిపడ్డట్టు) శాంతా! ఈ ఉప్పినేవిఁటి?

సా: అదే చెప్పబోతూంటే మీరు అడ్డొచ్చారు. అత్తయ్యగారికి పురోహితుడు చెప్పాడు-వాస్తుశాస్త్రప్రకారం యీ కొంప కేదో కీడుందట. శాంతి చేయించా లన్నాడు. లేకపోతే కుటుంబానికి దుర్యోగంట.

నా: వాడిమొహం యోగం. నాకు పట్టుకున్న పెద్ద దుర్యోగం వాడి పౌరోహిత్యం. కొంపతీసి మీరెవరూ ఒప్పేసుకోలేదుగద?

అ: నేనేంచేద్దును భగవంతుడా....నాయనా ఏడుకొండలవాడా.... రక్షించు తండ్రీ.

హే: అమ్మా....అమ్మా....(అని దూరంనించి పిలుచుకుంటూ వచ్చి) నువ్వోసారి అలా పూజగదిలోకి వస్తావా? అరె ఏవిఁటిది? ఎందుకమ్మా కంట తడిపెడుతున్నావ్?

నా: నేనిలా బతికున్నానని.

అ: (ఏడుపు గొంతుకతో) వింటున్నావా హేమా ఆ మాటలు?

హే: ఏవిఁటిది నాన్నగారూ? ఈ కొంపలో ఎవర్నీ బతకనివ్వరా మీరు? ఎందుకిలా అందర్నీ ఏడిపిస్తారు?

నా: ఏడుస్తున్నది మీరా నేనా? (పూజగదిలోంచి గంట విని పిస్తుంది) ఏవిఁటా గంట?

సా: పురోహితుడు మావయ్యగారూ....శాంతి చేస్తున్నాడు.

నా: ఆఁ? ఎవళ్ళకి పుట్టిందీ బుద్ధి? ఏవిఁటే వాడి సాహసం? నాకు తెలియకండా నా కొంపలో శాంతా? ఎవళ్ళిదంతా ఏర్పాటుచేశారు? ఏరా గోపాలం?

గో: ఇందులో తప్పేవుంది నాన్నగారూ? శాంతిచేయిస్తే కీడు తొలుగుతుందని అమ్మకి నమ్మకం. పోనీ-అదీ చూద్దాం. పోయిందేవుంది?

నా: వీల్లేదు. ముప్ఫైఆరువేలు పోసి కట్టిన కొంపకి కీడేవిట్రా నా తలకాయ్? ఎవడ్రా ఆ చెప్పిన పురోహితుడు? ఇలా రమ్మను వాణ్ణి. (గట్టిగా) ఏవయ్యోయ్....వసిష్టులవారూ ఇలా రండి.

పు: (దూరంనుంచి) వస్తున్నా....(దగ్గరగా వచ్చి) ఏం బాబూ.. పిలిచారా....?

నా: పిలవరుటయ్యా మరీ....ఆ పూజగదిలోదూరి ఏంచేస్తున్నావ్?

పు: అదేవిఁటి బాబూ....అలా మాటాడుతున్నారు? ఇప్పుడే విఘ్నేశ్వర పూజ ముగించాను.

నా: ముగించావా? ఉద్ధరించావ్. సరే. ఇంకా ఏమిటి ఆ తరువాత?

పు: బాబుగారు అన్నీ తెలియనట్టు అడుగుతున్నారు. ఏముందండి-ఆ తరవాత-అష్టాక్షరీ జపం, శనైశ్వరుడికి తైలాభిషేకం, నవగ్రహ పూజ, హెూమం.

నా: ఆ తరవాత నాకొంప నిర్ధూమధామం! చాల్చాల్లే.

పు: ఇదంతా ఆ శని ప్రభువు మాయబాబూ. మీచేత యిలా పలికిస్తున్నాడంటే.....

నా: ఆ శనిప్రభువువి నువ్వేలాగుంది చూడగా చూడగా....జరిగిందేదో జరిగిందీ-యింక అపుచెయ్యి-తెలిసిందా?

అ: (ఏడుపు గొంతుకతో) భయపడినంతా అవుతోంది. నాయనా ఏడుకొండలవాడా-రక్షించు తండ్రీ....ఏరా గోపాలం. చూస్తూ ఊరుకుంటావేవింరా? మీఅమ్మ బతికుండాలని లేదురా నీకు?

గో: అయ్యా వసిష్టులుగారూ.

పు: బాబూ సెలవియ్యండి.

గో: మా నాన్న మాటలు ఏం పట్టించుకోకండి. మీరు వెళ్ళి ఆ తంతేదో జరపండి దయచేసి, ఈ పూజ జరిగితీరవలసిందే.

పు: చిత్తం....మీరలా సెలవిస్తే తప్పుతుందా మరి....ఇంకా కొన్ని సామాన్లు కావాలి.

గో: వొస్తాయి. మాబావ అందుకే వెళ్లాడు. ఒచ్చేస్తూంటాడు—యీపాటికి.

పు: చిత్తం. అయితే పూజగదిలో ఉంటాను. అక్కడికి పంపించండి.

నా: ఏవింటీ? గ్రంథం అంతవరకూ వచ్చిందీ? నా కొంపలో-నా మనుషులే నాకు ఎదురు తిరుగుతున్నారన్నమాట? ఏరా గోపాలం?

గో: ఏం ఎదురు తిరగడం నాన్నగారూ....కోపం తెచ్చుకోకండా ఒక్కటి చెప్పండి....మా అందరిమీదా ఎందుకంత కసిమీకు? రానురాను కొంప అందరికీ యింత నరకంగా తయారయితే ఎలాగ?

నా: అవుతుంది....అవుతుంది....అందరికీ ఒళ్ళు పొగరెక్కితే యిల్లు నరకంగాక ఏమవుతుంది? తిన్నింటివాసాలు లెక్కపెట్టినట్టు-నా కొంపలోచేరి నాకే ఎసరుపెడుతున్నారా?....ఎవరక్కడ?

శి: నేను మావఁగారూ....సామాను కొనుక్కొచ్చాను....శాంతికోసం.

నా: తెస్తావు—నీ సొమ్మేం పోయింది?

శి: అనేశారా అంతమాటా ఇక మరి భయంలేదు. విన్నావా హేమా?

హే: పోన్లెద్దురూ....ఆయన మాటలకి లెక్కేమిటి?

నా: ఆఁ. నా మాటలే లెక్కలేదు నీకూ?

హే: దేనికైనా ఓ హద్దుంటుంది నాన్నగారూ. రాసిరాపాడే కొద్దీ ప్రాణం విసిగితే ఆఖరికి వానపాముకూడా తిరగబడి కరుస్తుంది. ఎన్నాళ్ళని భరించడం చెప్పండి. కడుపున పుట్టిన కూతుర్నిగదా....నామీద ఏమాత్రం అభిమానం ఉన్నా ఆయన్ని అలా నానామాటలూ అంటారా మీరు? అంటే కలకాలం ఊరుకోగలనా నేనూ? ఎన్నిచెప్పినా తాళిగట్టిన భర్త గదా....

గో: కొంపలో అందర్నీ రాసి రంపాన పెట్టొద్దు నాన్నగారూ. మీకు నమస్కరించి చెప్పేది ఇదే. మాకంటె మీకు యినప్పెట్టి ముఖ్యం అయితే ఎలాగ ఖర్మ.

నా: ఓహెూ....చదువుకున్న పెళ్ళాం హితబోధ బాగా తలకెక్కిందన్నమాట?

సా: మధ్య అనవసరంగా నన్ను మాటలనకండి.

గో: దాని గొడవెందుకులే....

నా: ఎవరి గొడవా అక్కర్లేదు. తెలుస్తోంది....నిన్న రాత్రిదాకా తన్నుకుచచ్చిన మీరంతా ఒక్కసారిగా యిలా మారిపోయారా? అందర్నూ ఏకమై ముసల్లాణ్ణి లొంగదీద్దాం అనుకున్నారా? అందుకా యీ పూజలూ అవీనూ? చూస్తా....అదీ చూస్తా. ఛస్తే యీ ఘటం మీకెవరికీ లొంగదు.

ఏమనుకున్నారో. చూపిస్తా నా తడాఖా.... ఈ క్షణంనుండి-ఒక్కదమ్మిడీ-దమ్మిడీ అంటే దమ్మిడీ-యీ కొంపమీద ఖర్చుపెట్టను. ఎలా బతుకుతారో చూస్తాను. ఆస్తంతా శంకర మఠానికి రాసిచ్చేస్తాను, యీ కొంపతో సహా. హాయిగా సన్యాసం పుచ్చుకొని యీ రాత్రిబండికే హృషీకేశం పోతాను. అప్పుడందరి కళ్ళూ చల్లబడతాయి. ఫకీరులైపోతారు నాకేం.... అనుభవిస్తారు. అమ్మో.... ఎన్ని వేషాలు.... ఎన్ని వేషాలూ.... కట్టుకున్న పెళ్ళాం. కొడుకు, కూతురు, కోడలు, అల్లుడు, అంతా నన్ను చప్పరించేద్దామనే.... అంతా నా డబ్బు తినెయ్యడానికే దాపురించారు. ఎంత ఆశ... ఎంత కుట్ర!

హే: అవున్నాన్నగారూ. మేం బతికివుండాలనుకోవడం కూడా కుట్రే. ఏం? హుఁ. మీలాంటి తండ్రి కడుపున పుట్టడం మహాపాపంగాక మరేవిఁటి?

నా: ఆహా.... నీలాంటి కూతురూ.... ఆలాంటి దుష్యంత మహారాజులాఁటి అల్లుడూ? ఆ కొడుకూ. సీమదొరసాని ఆ కోడలూ-ఇంటి ఇల్లాలు సరే-యిదంతా నా పూర్వజన్మ మహాపాపం గాదూ....??

శి: ఏవిఁటో మావఁగారూ. ఇవన్నీ యిప్పుడా తెలుస్తున్నాయి మీకు? "జీవిత సార్థవాహము విచిత్రగతిన్ బయనించు" అన్నాడు ఖయామ్!

నా: ఏడిశావులేవోయ్. కాస్సేపు నోర్మూసుకో. ముందు నీ పెళ్ళాన్ని ఎలా పోషించాలా ఆలోచించు! ఔను నిన్నే. ఇక రేపటినుంచీ నీ బుడిబుడి దుఃఖాలు ఎవరు తీరుస్తారో చూస్తాగా? ఏం? నేను సన్యాసం పుచ్చుకుని బదరీనారాయణం పోతున్నాను. తెలిసిందా?

అ: అన్నింటికీ ఆ ఏడుకొండలవాడే ఉన్నాడు. కానివ్వండి.

(పూజగదిలోంచి గంటా-మంత్రాలూ వినబడతాయి.)

నా: ఓహెూ! అదంతా శాంతికోసం. ఈ కొంపకి శాంతికోసం. హరి భగవంతుడా నువ్వుకూడా వీళ్ల పార్టీయేనా....

(గంట గట్టిగా వినబడుతుంది)

# రంగము 4

(పూజగదిలో గంట సన్నగా వినబడుతుంది)

గోపాలం: అమ్మా! ఇంక నువ్వింతేనా? హుఁఎన్నిసార్లు చెప్పనమ్మా!

అమ్మ: (ఏడుపు గొంతుకతో) అంతా నా ఖర్మరా నాయనా. మొన్న కార్తీక దీపం పెట్టినప్పుడు అ సిద్ధాంతి చెప్పనే చెప్పాడు.

గో: అవును. వాడు చెప్పిందే నీకు వేదవాక్యం. ఎంత సేపూ ఆ సిద్ధాంతీ. పూజారీ - కర్మ-గ్రహచారం-అంతే నీ లోకం. ఇహ కొంపలో మనుషులు ఎలాపోయినా లెక్కలేదు. అంతేగా?

అ: అను నాయనా అను. అంతా నా తలరాత. పుట్టెడు దుఃఖంలో నేనుంటే——

గో: ఈ సంసారంలో దుఃఖంలేని దెప్పుడు? ఏడుపులూ పెడ బొబ్బలూ లేకుండా ఏ ఒక్క రోజు గడిచింది?

అ: చివరికి మిగిలేది అంతేలే. నా జన్మ యిలా వెళ్ళవలసిందే. అందర్నీ పెంచి పెద్దవాళ్ళని చేసి-

గో: (చిరాగ్గా) నా ఏడుపూ అదే. పెంచి పెద్దవాళ్ళను చెయ్యటం దేనికీ, యిలా ఏడిపించడం దేనికి?

అ: అనరా నాయనా అను. నీ నోటికి అడ్డేమిటి? హయ్యో్యరాత. ఒరే గోపాలం....ఇలా నన్ను ఏడిపించకపోతే, కాస్త నాలుగు చోట్లూ తిరిగి వాకబుచేసిరా నాయనా. నీకు పుణ్యముంటుంది.

గో: ఈ పూటకి ఇంక తిరగలేనమ్మా. తిరిగి తిరిగి కాళ్ళు కదుములు కట్టాయి. ఛీ వెదవ బతుకు. మధ్య నేను నలిగిపోయి ఛస్తున్నాను——

అ: ఆ శివయ్యగారిని వాకబు చేశావా?

గో: ఆఁ....వాడో పరమశివయ్య. అయ్యో పాపం అంటూనే లోపల లోపల సంతోషం చెవలవాజమ్మకి, హుఁ....అందరూ అంతే.కుళ్ళు.

అ: అవునా. కాస్త వెళ్ళి వీరభద్రయ్యగారిని అడగరా. ఆయనకి తప్పకుండా తెలుసుంటుంది. మీ నాన్నగారికి భద్రయ్యగారంటే దేవుడితో సమానం. వెళ్ళి కనుక్కోరా గోపాలం. (కంఠం మార్చి ఏడుపు ధ్వనిస్తూ) ఆ వీరభద్రయ్యే మన సంసారాన్ని యీకాడికి తెచ్చాడు. ఈ పాడుకొంప కట్టమని సలహా యిచ్చింది ఆ రావణాసురుడే.

గో: బాగుంది వరస. లక్షమంది లక్ష సలహాలు చెప్తారు. చెపితే అంతే? అవన్నీ వినేసి అవక తవక పనులుచేసి చెడిపొమ్మని ఎక్కడుందీ?

అ: పోనీలేగాని-ఆ వీరభద్రయ్యగారిని వెళ్ళి అడిగిరా——

గో: అడిగానమ్మా అడిగాను. వీరభద్రయ్యనీ పుల్లయ్యనీ అందర్నీ అడిగాను....ఛీ. తలుచుకుంటే సిగ్గు సిగ్గు. కుటుంబ కలహాలొచ్చి మా నాన్నగారు పారిపోయారు అని ప్రతి తుమ్మాయికీ జగ్గాయికీ చెప్పకొని బతిమిలాడేదా?....

అ: ఏం చేస్తాం నాయనా! వసుదేవుడంతటివాడు గాడిదకాళ్ళు పట్టుకున్నాడట. అవసరమొస్తే తప్పతుందా మరీ.

గో: ఆ వసుదేవుడికి బుద్ధిలేకపోతే నాకైనా బుద్ధుండాలి. నువ్వెన్నట చెప్ప....యింక నేను తిరగనమ్మా....

అ: నువ్వలాగంటే నాగతి ఏంకాన్రా?

గో: ఏం? మేం అంతా బతికి లేమనా నీ ఉద్దేశం?

అ: అయ్యో నీ అఘాయిత్యం కూలా! ఏం మాటలురా అవీ.... చెట్టంత మహారాజు యిల్లువిడిచి పారిపోయారని నే నేడుస్తుంటే....

గో: అయినవ్వుడు ఆ శాంతి ఎందుకు పెట్టించావ్....ఆ మనిషికి అన్ని విధాలా తిక్కెక్కించి యివ్వడేడిస్తే ఏంలాభం?

హేమ: (ప్రవేశిస్తూ) ఎవరికిరా తిక్క?

గో: ఎవరికా? నీకూ నాకూ, యీ కొంపలో అందరికినీ. ఏం?

హే: మాటాడితే అలా కసురుకుంటావేంట్రా నాయనా?

అ: ఇంకా ఏం విన్నావ్....వాడినోటికొచ్చినట్టు ఏమిటేమిటో అంటున్నాడు. పోనీలే అవన్నీ, అందరూ చివరికి నన్ననేవాళ్ళేగా. చచ్చి ఏలోకాన్నుందోకాని-మొన్నటిదాకా ఆ అత్తగారూ అలాగే ఏడిపించింది. యిప్పుడు సంతానం ఏడిపిస్తోంది. అంతే-యీ ఘటం యిలా వెళ్ల వలసిందే.

హే: ఏమన్నాడేమిటే? ఏవిఁరా గోపాలం? ఉన్నబాధలు చాలవురా బాబూ. ఇలా తయారయావేంరా బాబూ చివరికి.

గో: అమ్మసాధింపు చాలలేదూ. ఇహ నువ్వొకర్తివీ....ఇంకిలాగే ప్రాణం విసిగిస్తే నేనుకూడా పారిపోతాను. అప్పుడందరి ప్రాణాలూ హాయిగా ఉంటాయి.

అ: పారిపొండి నాయనా. అందరూ పారిపొండి. నాయనా ఏడు కొండలవాడా....యింక పడలేను నాయనా బాధలూ. దయుంచి నన్ను తీసుకుపోదూ తండ్రీ.

హే: దయ. దయ మనమీద మనుషులకే లేదూ. ఇక దేవుళ్ళ కెక్కడనుంచి వస్తుంది. ఏఁవిరా గోపాలం-యిలా ఒకళ్ళనొకళ్లం బరుక్కుంటూ కూర్చోటమేనా? ముందు చెయ్యవలసిందేదో కాస్త ఆలోచిస్తారా?

గో: ఏం చెయ్యమంటావో చెప్పు. పొద్దున్నించీ ఊరంతా త్రిపాది నక్షత్రంలా తిరిగాను. అడ్డమైనవాళ్లనీ అడిగాను, మా నాన్నగారు కనబడ్డారా అని. ఆ మహారాజు ఎవరికీ కనబడలేదు. ఏంచెయ్యమంటావు?

హే: నువ్వు చెయ్యగలిగింది అంతే అన్నమాట!

గో: ఇంకేం చెయ్యను-చెప్పు పోనీ. నా మాట కేదైనా విలువుంటే. ఏదైనా చెప్పొచ్చు-చెయ్యొచ్చు. మధ్య నే నెవణ్ణి?

హే: అదేవిట్రా అలా అంటావ్. నాన్నతరవాత నాన్నంతటి వాడివీ....

గో: అఁ....అలా సంతృప్తిపడవలసిందే. ఇప్పుడదంతా ఎందుకు కాని—ఏంచెయ్యమంటారో చెప్పండి. మళ్ళీ ఊరంతా ఒక్క రౌండ్ చుట్టి రమ్మంటారా? సిద్ధం.

అ: వెళ్ళిరారా నాయనా. వెళ్ళి కాస్త బతిమాలి తీసుకురా. నేరకపోయి స్వతంత్రించి ఒక్క పనిచేసేసరికి ఎంత ముప్పొచ్చిందో చూడు. ఇంకెప్పుడూ అలా చెయ్యనని చెప్పి తీసుకురారా నాయనా.

హే: అవునురా-వెళ్లు.

గో: బాగుంది వరస. ఎక్కడున్నారని వెళ్లను? ఫలానా చోటని తెలిస్తే—

అ: — తెలిస్తే నేనే వెళుదును. అది తెలియకే గదురా నిన్ను బతిమాలుతున్నది?

హే: నాన్నగారు అలా దెబ్బలాట పెట్టుకొని పారిపోతే నీకు చీమ కుట్టినట్టయినా లేదేమిరా?

(హేమా....హేమా అని దూరంనుంచి పిలుపు)

హే: ఛస్తుంటే సంధిమంత్రం అని మధ్య యీాయనగొడవొకటి నాకు.

శివరావు: (ప్రవేశిస్తూ) హేమా! పేపరువాళ్లు వేసేశారు. అచ్చయిపోయింది తెలుసా. వండర్‌ఫుల్....చాలా బాగా వచ్చిందిలే....

అ: ఏమిటి నాయనా అదీ?

శి: ప్రకటన అత్తయ్యగారూ! పత్రికా ప్రకటన! 'మామగారు కనిపించుట లేదు' అని పేపర్లో వేయించేశాను. నైస్ ఎడ్వర్‌టైజ్‌మెంటు....ఇంక ఫరవాలేదులెండి. చూడండి....ఫోటోతో సహా ఎలా అచ్చయిందో.

గో: అదేవిటి శివరావు? ఏకంగా పేపర్లో వేయించేశావా?

శి: సెన్సిబిల్ థింగ్ అంతేకదుటోయ్ మరీ. వర్తమానం తెలిసిన వాళ్లకి వందరూపాయలు బహుమతి అని కూడా వేయించాను. ఎందుకైనా మంచిదని.

గో: బాగుంది వరస. దీనితో యిహ పూర్తిగా రచ్చకెక్కేమన్న మాట.

హే: అదేవిటండీ అలా చేశారూ? కాస్త నాతోనన్నా ముందు చెప్పలేకపోయారా?

శి: చెపితే ఏంచేసేదానివి? ఒద్దనేదానివి. అంతేగా.

అ: హయ్యో రాత. ఎంత అఘాయిత్యప్పని చేసేవు నాయనా. ఏంకారి నాకు దేవుడా? ఈ అప్రతిష్ట ఎలా తొలుగుతుంది, హేమా.... ఏమిటిదంతా? ఇలా పండంటి సంసారం పేపర్లో కెక్కవలసిందే?

హే: ఏమండీ....యీ పాడుబుద్ధి మీకేపుట్టిందా?....లేక ఆ సావిత్రి పన్నాగమా?

శి: పాపము శమించుగాక. మధ్య ఆ అమ్మాయి నెందుకు ఆడిపోసుకుంటావు?

గో: హేమకదో జబ్బులే. ఉత్తపుణ్యాని కెందుకో సావిత్రినిచూస్తే కళ్ళల్లో నిప్పులు పోసుకుంటుంది.

అ: మహా వెనకేసుకొచ్చావులేరా పెళ్ళాన్ని.

హే: ఒకవేళ యిది ఆవిడగారి సలహాయేమో అని అడిగాను. అదీ తప్పే?

గో: అడుగుతావు అడుగుతావు. ఈ కొంపలో మాటలుపడడానికీ, చాకిరీ చెయ్యడానికి అదీ నేనూ దొరికాం. అంతేగా? నువ్వూ మీ ఆయనా మట్టుకు అవకతవక పనులన్నీ చేసి మా కుటుంబాన్ని బజారులోకి యీడుస్తుంటారు. (స్థాయి హెచ్చించి) అయినా మేం నోరుమూసుకు ఊరుకోవాలి. అవునా?

శి: కొంచెం సెన్సిబుల్‌గా మాటాడు గోపాలం. మధ్య నేనెవర్ని బజారులోని కీడ్చానూ?

గో: బజార్లోకి యీడ్చడం కాకపోతే పేపర్లో వేయించడం ఏమి టోయ్? పైపెచ్చు సిగ్గులేక చేసిన పనిని సమర్థించుకుంటావ్?

శి: అంతేలే ప్రపంచం. మంచిచెయ్యబోతే ఎప్పుడూ చెడే ఎదు రౌస్తుంది.

అ: ఇన్నాళ్ళూచేసినవి చాలవా నాయనా? మమ్మల్ని ఉద్ధరించడం కోసం యీలాంటివికూడా చెయ్యాలా? ఇంక నలుగురిలో ఏ మొహం పెట్టుకు తిరగను నేను?

శి: చూస్తున్నావా హేమా?

హే: చూస్తున్నాను. చూడకేం చెయ్యను ఖర్మ! క్షణక్షణం కత్తిమీద సాములాఉంది నాకు! నాన్నగారే నయం! హాయిగా పారిపోయి సుఖ పడ్డారు. ఆడదాన్ని నే నెక్కడికి పారిపోగలను?

అ: పోనీ—మీ ఆయన చేసిన పని ఏమైనా బాగుందే?

శి: గడియగడియకు అదేమాట! నేనేదో మహాపాపం చేసినట్టు మాటాడుతారేం అంతా? ఆ మహానుభావుడు పారిపోవడం బాగుందిగాని వెతకడానికి ప్రయత్నించడం తప్పా? అంతేనా?

గో: ఏమిటోయ్ వెతకడానికి నువ్వుచేసిన ప్రయత్నం? పట్టుమని ఫర్లాంగుమేరైనా వెళ్ళి వెతికావా?

శి: ఓహో....త్రిపాది నక్షత్రంలాగ ఊరంతా తిరిగేస్తే ఆయన దొరుకుతాడన్న మాట. ఆయనేదో ఉంగరం, ఫౌంటెన్ పెన్నూలాగ యిసుకలోనూ రోడ్డువక్కా వెతికితే దొరుకుతాడా?

అ: చాల్లేవోయ్ నేర్చుకుపోయావ్? అంచేత వాడవాడలా టముకు వేయిస్తావా?

(అత్తయ్యా అత్తయ్యా అని పిలుపు)

హే: చూశావా చుట్టుపక్కలవాళ్లు వినేటట్టు ఎలా గావుకేక లేస్తోందో!

అ: (కాస్త గట్టిగా) ఇక్కడున్నానే మా చిట్టితల్లీ. పుట్టెడు బెంగతో నే నేడుస్తుంటే మధ్య నువ్వొకత్తివీ....తిప్పలాడి దొరసాని బొమ్మవి.

సా: (ప్రవేశిస్తూ) అత్తయ్యా! పురోహితుడొచ్చి వాకిట్లో నుంచు న్నాడు. ఎల్లుండేదో మహా ద్వాదశీ, శుక్రవారం. గుళ్ళో అభిషేకం చేయించనా అంటున్నాడు.

గో: అంటున్నాడా? అంటే నువ్వేమన్నావ్?

సా: నే నేమంటాను మధ్యని? అభిషేకాల గొడవ నాకు తెలీదు బాబూ అత్తగార్ని కనుక్కొస్తా నన్నాను. ఏమండీ? ఏం చెప్పమంటారు?

అ: మీ అత్తగారు యీ తెల్లారికట్లే హరీ అందని చెప్పు.

హే: (అఘాయిత్యంగా) ఛా ఏంమాటలమ్మా అవి?

సా: అలా అన్నా, దానికీ యింకేదో పూజో అభిషేకమో అంటాడు.

గో: తెలివితేటలు చాలించుగాని — ఈ మాటుకింకే పూజలూ అక్కరలేదని చెప్పిరా వెళ్ళి.

సా: నేనేం తెలివైనదాన్నని మీతో అనలేదు. నాకే తెలివుంటే యీ కొంపలో కొచ్చి ఎందుకు పడతాను?

అ: నిజమేలే అమ్మా. కోడలువి నువ్వో మహారాణివి—అల్లుడు గారు ఆయనో మహారాజు. ఏ పూర్వజన్మ శాపంవల్లనో యీ కొంపలోకొచ్చి పడ్డారు. అంతేనా?

హే: పోనీలే అమ్మా, ఎందుకొచ్చిన గొడవ అదంతానూ. ఇలా మాటాడినన్నాళ్ళూ ఎక్కడికి తేలతాం? ఇప్పుడేం చెయ్యాలో ఆలోచిం చాలి గాని?

శి: అవునా? సరిగ్గా అందుకే నేను పేపర్లో ఎడ్వర్‌టైజ్‌మెం టిచ్చాను.

సా: అదేవిఁటీ? మావఁగారి గురించేనా?

గో: ఆఁ....ఆ శుభవార్త గురించే. మిగిలున్న కాస్తపరువూ పూర్తిగా పోతేగాని ఇంటల్లుడికి సంతృప్తిలేదు.

శి: (ఉద్రేకంతో) గోపాలం! మాటలు తిన్నగారానీ. నన్ననవస రంగా రెచ్చగొట్టకు. ఆనక విచారిస్తావు తెలిసిందా?

గో: ఏం ఏంచేస్తావ్? పీకతీసి కొరతవేస్తావా?

సా: అబ్బబ్బబ్బ. కాస్త తగ్గుదురూ. అసహ్యం. ద్వారపూడి పశు వుల సంతైనా యీ కొంపకంటె నయం....ఏదండీ, అదేనా పేపరు? ఇందులోనేనా ఎడ్వర్‌టైజ్‌మెంట్ వేయిస్తా....ఏదీ....ఓ యిదా....

''కనిపించుటలేదు, నా మామగారైన శ్రీ అడ్డతీగల ఆంజనేయులు గారు కుటుంబ కలహములవల్ల రెండుదినముల క్రితం యిల్లువిడచి పారి పోయిరి. వయస్సు యాభైరెండు—'' ఇంతేనా మావగారి వయస్సు?—

శి: అదేమో! ఎవడు చూశాడు లెక్కలు! ఉజ్జాయింపుమీద వేశాను.

సా: పోన్లెండి, నలభైదాటాక ఎన్నేళ్ళయినా ఒకటే అనేవాడు, వెనకటికి మా బావ.

గో: బావ! వాడే నీకు నెత్తిమీద దేవతా? వాణ్ణి తలుచుకోనిదే ఒక్కక్షణమైనా నీకు గడవదల్లే ఉందే?

సా: ఊరికే తలుచుకోవడంలో తప్పేంలేదు. ఉండండి. ముందు యీ ప్రకటన చదవ నివ్వండి—

''అంత పొడగరీ కాదు, పొట్టి మనిషీ కాదు''—అయితే మరేమిటి?

''శరీరఛాయ నలుపునూ కాదు, తెలుపునూ గాదు.''

ఈ రెండూ కాక మరేమిటి? చామనఛాయా కాఫీ పొడుం రంగా? లేకపోతే పాలపిట్టరంగా? ఇలా రాస్తే చూసేవాళ్ళు ఎలా పోల్చుకుంటారండీ?

శి: మరేం ఫరవాలేదు. మహారాజులా పోల్చుకుంటారు. అడ్డతీగల ఆంజనేయులుగారని పేరిచ్చాంగా. చహరా గుర్తుపట్టడానికి అది చాలు, ఇహ ఆచూకీ చెప్పినవాళ్ళకి వంద రూపాయలు బహుమతీ, ఇంకేం కావాలి?

అ: పిల్లికి చెలగాటం ఎలక్కి ప్రాణపోకలా అన్నట్టుంది నాయనా మీ యిద్దరి వరసా చూస్తే! చెట్టంత మహారాజు కనబడకుండా పోయి మేవేడుస్తూంటే—

హే: అదంతా వాళ్ళ కెందుకూ, వాళ్ళ కిదంతా ఏదో ఆటలా ఉంది.

గో: ముఖ్యంగా మీ ఆయనకి అలాగే ఉందిలే.

హే: మీ ఆవిడేం తక్కువ తినలేదు, చాపకింద నీరులా చల్లగా అన్నీ చేసేసి మళ్ళీ ఏమీ తెలీనట్టు నంగనాచిలా మొహం పెడుతుంది.

సా: ఓహెూ....కనిపెట్టే వేలాగయితేనేం నా నంగనాచితనం. నువ్వో....రెండు రోజుల క్రితం పెదిమలకి తేనె రాసుకుని మాటాడేవే? ఇంతలో ఏ వొచ్చిందీ? చువ్వనాతి గుణాలంటే యివే కాబోలు, సాగుతూంటే సరి.

హే: నేననేదీ సరిగ్గా అదే. ఛీ....నిన్నని ఏం లాభం? మావాడు అమాయకుడు కాబట్టి నువ్వు ఆడింది ఆటా పాడింది పాటా చెల్లిపోతోంది. మావగార్ని బయటికి గెంటేసింది చాలక పైపెచ్చు పేపర్లో వేయిస్తావా?

సా: (కోపంగా) అవ్వ....(నోరు నొక్కుకొంటున్నట్టు) నేనా పేపర్లో వేయించిందీ?

హే: నువ్వు కాకపోతే మరెవరు?

సా: అబ్బ....ఏం గడుసుతనం! తల్లి కూతురూ కలిసి శాంతి శాంతోయ్ అని ఊదరగొట్టి ఆ ముసలాయిన్ని బైటకు గెంటారు. నువ్వేమో మీఆయనతో లాలూచీ అయి పేపర్లో ఎడ్వర్‌టైజు చేయించావ్! ఎటొచ్చీ చేతకానివాళ్ళం మీ అన్నయ్యా నేనేగా....మమ్మల్ని కూడా బైటికి గెంటేసి ఇంట్లో తల్లీ కూతురూ హాయిగా రాజ్యమేలుదామని.అంతేగా-

అ: అమ్మయ్యో. ఎంతలేసి మాటలంటోంది! ఒరే గోపాలం!

గో: (చాలా విసుగ్గా) ఓయ్. ఏఁవమ్మా....

అ: ఈ బాధలు నేను పడలేనురా, నీ పుణ్యముంటుంది. నన్ను కూడా ఆ మహారాజు దగ్గిరికి పంపించెయ్యరా నాయనా—

శి: పోనీ అలా చేద్దామన్నా ముందు ఆ మహారాజు ఎక్కడున్నాడో తెలుసుకోవాలిగద అత్తయ్యగారూ! ఆ ఉద్దేశంతోటే నేను పేపర్లో వేయించాను!

అ: (విసుగ్గా) చాల్లే నాయనా నిర్వాకం. ఇంక ఊరుకో. నీ మూలానే పండంటి సంసారం యిలా అయింది.

శి: పండంటి సంసారం. ఏం పండు అత్తయ్యగారూ అది. శుద్ధ మేడిపండు....తెలిసిందా?

హే: ఏవండీ. పోనీ నన్ను చూసైనా కాస్త తమాయించుకోరాదూ?

శి: ఏం తమాయించుకోడం హేమా. ఈ కొంపలో నే నింకొక్కక్షణం ఉండను. జరిగిన పరాభవం చాలు.

గో: (నిరసనగా) మానవంతుడివి బయల్దేరావు. మాకు జరిగిన పరాభవమో? కుటుంబ కలహాన్ని పేపర్లో వేయించావా? పరువు మర్యాదలు మంట గలిపావా!

శి: పరువు మర్యాదలు! ఈ మేరంగి మేళానికి పరువు మర్యాదలొకటీ! (స్థాయి హెచ్చించి) పరువున్న పెద్దమనిషెవరయినా అలా కొంపొదిలి పారిపోతాడా?

గో: నీలాంటి అల్లుణ్ణి తెచ్చి యింట్లో పెట్టుకొన్నాక పారిపోక ఏం చేస్తాడు?

హే: అలా అనుకోకపోతే నీలాంటి కొడుకుని చూసి హడలిపోయి పారిపోయా రనుకోరాదూ?

గో: అబ్బోస్. నువ్వేం ఆయనగార్ని వెనకేసుకు రానక్కర్లేదులే.

హే: ఎందుకక్కర్లేదురా? నువ్వేమో ఆ పిగిలి పిట్ట ఏం కూసినా వెనకేసుకు రావచ్చా?

సా: (కోపంగా) నేను పిగిలిపిట్టయితే నువ్వు వానపాముని. తెలిసిందా? మాటలు తిన్నగా రానీ.

హే: లేకపోతే ఏం చేస్తావేం. ఇంట్లోంచి గెంటేస్తావా?

సా: నిన్ను గెంటయ్యటానికి నే నెవర్ని తల్లీ, అంతాశలేదు నాకు. మేమే పోతాం, తల్లీ కూతురూ అల్లుడూ హాయిగా ఉండండి.

హే: నీ కడుపు మంటల్లా మేం ఈ కొంపలో ఉన్నామనేగా, అక్కర్లేదులే. మేమే పోతాం. నువ్వే పట్టం కట్టుకో....

(తల్లి ఏడుపు వినబడుతూంటుంది)

ఎందుకమ్మా ఏడుస్తావ్ ఊరుకో.

అ: ఏడవక ఏం చెయ్యను హేమా. చెట్టంత మహారాజు కంటికి కనబడకుండా పోయె. కొడుకూ, కోడలూ వరస చూస్తే యిలా ఉంది. ఏ ముహూర్తాన యీ కొంప కట్టేమో కాని-శాంతి చేసినా లాభం లేక పోయింది.

గో: శాంతి! మన బతుకులికి ఒక్కసారే శాంతి. పోనీ నన్నేం చెయ్యమంటావో చెప్పమ్మా. ఈ క్షణమే సావిత్రీ నేనూ యిల్లొదిలి పోతాం, సరేనా?

అ: అవిధంగా కక్ష సాధిద్దామనా నీ ఉద్దేశం?

గో: అదీ తప్పేనన్నమాట. ఇంట్లో ఉంటే తప్పు, బయటికిపోతే తప్పు, ఇంక ఏ గంగలో దిగను?

సా: అదా మీ ఆశ. ఆ తండ్రికి కొడుక్కాదూ! మీరూ ఏ గంగ లోనో దిగి మీ సమస్య తీర్చుకుంటే నా గతేం కాను?

గో: సరే. అందుకూ నాకు పర్మిషన్ లేదు. బతకడం అంతకంటే చాతకావడం లేదూ.

సా: ఇంగిత జ్ఞానం ఉంటేసరి, ఎలాగైనా బతకొచ్చు. మీకూ ధైర్యం ఉంటే ముందు యీ కొంపలోంచి బైటపడండి. పదండి పోదాం. మీకు చేతకాకపోతే నే నుద్యోగం చేసి మిమ్మల్ని పోషిస్తాను. ఆ మాత్రం ఉద్యోగమే దొరక్కపోతుందా ఏం?

హే: (వ్యంగ్యంగా) ఎంతమాటా! అందులో నీలాంటి దానికి! మహరాజులా దొరుకుతుంది.

సా: పోనీలే. నీ ఆశీర్వచనంవల్ల అలాగే అనుకో.

హే: ఏమండీ? మాటాడరేం? ఆడదానికున్న పాటి పౌరుషమేనా లేదేం మీకు?

శి: నా సంగతి యిందాకనే చెప్పేశాను. నేను యీ క్షణమే వెళుతున్నాను.

హే: ఎక్కడికి?

శి: ఎక్కడి కేమిటి? ఈ ఆనంద నిలయంలోంచి ఎక్కడికైనా సరే.

హే: నన్ను కూడా తీసుకుపొండి.

శి. వస్తానంటే తప్పకుండా తీసుకువెడతాను.

అ: అందరూ తలోదారీ చూసుకుంటే నా గతేమిటి హేమా?

శి: మీకేం అత్తయ్యగారూ? ఆ ఏడుకొండలవాడే మిమ్మల్ని రక్షిస్తాడు.... హేమా! వెళ్ళి రిక్షా తీసుకొస్తాను.

హే: ఏమండోయ్, ఇదిగో ఒక్కమాట-వినిపించుకోకుండా వెళ్లి పోయారు చూశావా?

సా; ఏమండీ, మీ సంగతేమిటి?

గో: నన్నేం మాటాడించకిప్పుడు. నాకేదో పిచ్చెక్కినట్లుంది.

సా: సరే-నేనూ వెళ్ళి సామాను సర్దుకుంటాను. నేను వెళ్ళడమే ఖాయం. వస్తారా మీరూ రండి. అంతే. ఖరాఖండీ. మనిషి కో మాటా, పువ్వుకో తావీ అన్నాడు.

(అమ్మ సన్నగా ఏడుపు లంకించుకొంటుంది.)

హే: ఎందుకమ్మా ఏడుస్తావ్? ఏ దెలా జరగాలో అలా జరుగు తుంది. కానీ చదువుకున్న కోడలని ఆనాడు మురిసిపోయావ్. ఈనాడు అనుభవించూ....(బయట జట్కా ఆగిన చప్పుడు) అరే బయట ఏదో బండి ఆగిందే.

(దూరంనుంచి హేమా హేమా అని కేక.)

నా: (ప్రవేశిస్తూ) హేమా హేమా కాసిని మంచినీళ్ళు తెచ్చి పెట్టు. ఒరే గోపాలం ఆ వనసపళ్లు తీసి లోపల పెట్టించు.

హే: అరె. నాన్నగారా! అమ్మా. నాన్నగారొచ్చారు.

అ: ఆఁ....ఆఁ....నిజమే....నా తండ్రీ. ఏడుకొండలవాడికి నామీద దయ కలిగిందా. హమ్మయ్య, ఎంతగండం ఎంతగండం.

గో: వచ్చేశారా నాన్నగారూ. పోన్లెండి యింతటితో బైటపడ్డాం. అదే చాలు. నిద్రాహారాలు లేక బెంగట్టుకు చచ్చాం....అందరం.

అ: మెల్లిగా అంటావ్. ఇంకొక్కరోజు ఆలస్యమైతే నా ప్రాణం గుటుక్కుమనేది. నా తండ్రీ, సత్యనారాయణమూర్తీ. రక్షించు నాయనా.

నా: ఏం? మళ్లీ గుండె దడ తిరగబెట్టిందా? ఏంరా గోపాలం? ఏమిట్రా సంగతి?

గో: గుండెదడ అంటారేమిటి నాన్నగారూ! మీరు చేసిన పనికి గుండెదడ రాదూ మరి?

హే: మంచినీళ్ళు యిందండి నాన్నగారూ. బాగా చేశారులెండి. అణిగి మణిగి పడున్నందుకు మా బాగా శాస్తి చేశారు. కసితీరిందా ఇప్పుడైనా?

నా: కసా? ఎవరికి కసి? ఎవరిమీద కసి?

గో: దయచేసి యింకెప్పుడూ యిలా చెయ్యకండి నాన్నగారూ!

నా: మొదలా! కొంపలో అడుగు పెట్టానో లేదో రగడ ప్రారంభమా?

గో: మీరిలాంటి అఘాయిత్యప్పని చెయ్యడం బాగుందా?

నా: ఏవిట్రా అదీ! నువ్వంటున్నదేదో సరిగాచెప్పి ఏడవకూడదూ?

సా: ఇంతవరకూ ఏడ్చింది చాలు మావఁగారూ! ఇంకా ఎందుకు?

నా: ఏడ్చారూ? అందులో కొత్తేముందీ? ఇంటిల్లిపాదికీ అల వాటేగా అదీ.

సా: మీ దయవల్ల రోజూ ఏడుస్తూనే ఉంటాం అనుకోండి. ఈ రెండు రోజులూ ఇంకొంచెం ఎక్కువేడ్చాం. అంతే తేడా.

నా: ఏం? నేనేం పరారీ అయిపోయా ననుకున్నారా కొంపతీసి?

సా: ఆఁ....

గో: మీరూ——

హే: ఇల్లొదిలి ఎందుకు పారిపోయారు మరి?

అ: నాయనా ఏడుకొండలవాడా....మరేం చేసినట్టుండీ మీరూ?

నా: హరి పరమేశ్వరా. ఇది కొంపా, పిచ్చివాళ్ళ ఆసుపత్రా? నేను పారిపోయానంటారేమిటి?

గో: అనడం ఏమిటండీ. హడలిపోయి మీ అల్లుడు పేపర్లో వేయిస్తేనూ?

నా: ఏమిఁటీ! పేపర్లో వేయించారూ? ఏమఁని?

సా: ఇదిగో చూడండి. మీరు పేపరు చూడలేదూ?

నా: నా ఖర్మగాలి నాకు పేపర్లెందుకే-వొంటికి యిన్నేళ్ళొచ్చి! ఏదీ-యిలా తే. ఏం అఘోరించాడోనూ. ఆఁ....''కనబడుటలేదు''.... ఎవరు? నేనా నా ఖర్మగాలి! కనబడకపోవడమేమిటి? హారి పరమేశ్వరా? ఇంటిల్లిపాదీ గుడ్డివాళ్లెప్పుడయిపోయా[రా?

సా: మరి యీ రెండు రోజులూ ఏమయిపోయారు మావఁగారూ?

నా: ఏదీ-యిలా చూడు నా చిట్టితల్లీ! పారిపోయాననుకున్నావా? ఇంకా నయం. బైరాగుల్లో కలిసిపోయాననుకున్నారు గారు.

గో: మరి యీ రెండు రోజులూ ఎక్కడికి వెళ్ళారు నాన్నగారూ?

నా: నాకేదో లక్ష వ్యవహారాలుంటాయి. నీకెందుకవన్నీ?

అ: పోనీలెండి. ఏడుకొండలవాడి దయ. తిరిగొచ్చారు. అంతే చాలు.

నా: తిరిగిరానూ మరి! వచ్చేటప్పుడు ఆ శరభయ్యన్ను కూడా వెంటబెట్టుకు వద్దామనుకున్నాను....అల్లా గుడ్లు మిటకరించి చూస్తా రేంరా? శరభయ్య లేడూ?

గో: శరభయ్యంటే మీ వేలువిడిచిన మేనమామ కొడుకు-ఆ మెల్ల కళ్ళాయన—

నా: నీ చేపకళ్లకంటే నయమేగాని-ఆఁ వాడే. శరభయ్యరా! శరభయ్య లేడూ?

గో: ఒకప్పుడుండేవాడు మరి—

నా: ఇప్పుడూ ఉన్నాడు....మహారాజులాగ. అప్పుడూ యిప్పుడూ ఎప్పుడూ ఉంటాడు వాడు. వాడికేం. పాతికెకరాల మాగాణీ-పెంకుటిల్లూ-ఏడు జతల పశువులూ....

గో: అదంతా సరేలే....వాడి గొడవెందుకిప్పుడు?

నా: అయితే విను. ఈ కొంప వాడికి అమ్మేస్తున్నాను. ఖరారు నామా రాసేశాను. ఇక తన్నుకు చావండి.

అ: ఆఁ....కొంప అమ్ముకోవడమా? ఎంత అఘాయిత్యం?

గో: ఇంతా కష్టపడి కొంపకట్టి అమ్ముకోవడం దేనికి నాన్నగారూ!

హే: ఈ రెండు రోజులూ కనబడకండాపోయి-మమ్మల్నేడిపించి-చివరికి యిదా మీరు చేసిన నిర్వాకం!

అ: మరేవిఁటనుకున్నావు తల్లీ! కావరాని కొచ్చిందగ్గర్నించీ చూస్తున్నాను. ఇదే వరస. పెళ్ళాం పిల్లల్ని ఎలా ఏడిపించడమా అని అనుక్షణం ప్లానులు వేస్తుంటారు.

హే: ఏం నాన్నగారూ! ఇప్పుడీ కొంప అమ్ముకోవలసిన అవసరం ఏమొచ్చిందీ?

నా: అడిగావ్ గద, చెప్తాను విను. ముందు యిది చెప్పు. రెండు రోజులు నేను కనబడకపోతే, పరారీ అయిపోయానని మీరంతా లోవ ల్లోపల, సంతోషించి పైకిమాత్రం బుడిబుడి దుఃఖాలు నటించవలసిన అవసరం ఏమొచ్చిందీ? మీ అవసరాలు మీవి! మీకు నాడబ్బు కావాలా? నా ఆస్థిపాస్తులన్నీ గూడా కావాలా? మళ్ళీ నాఅజమాయిషీ పనికిరాదూ? నేను పరారీ అయిపోకూడదు. అది మళ్ళీ మీకు బాధ. నేను పరారీ అయి పోయినవాడిలా ఇంట్లో ఉండాలి. అవునా? మొన్నమొన్న ఇంటిల్లిపాదీ నామీద ఎదురు తిరిగి నా పెత్తనం అక్కర్లేదన్నారే? మళ్ళీ ఒక్క క్షణం నేనింట్లో లేకపోయేసరికి తన్నుకు చచ్చారా లేదా చెప్పండి?

—మాట్లాడవేం యిల్లాలా?

—మాట్లాడవేం హేమా?

—గోపాలం సరే మాటాడలేడు. అదంతా పితృభక్తి. నీ సంగతి ఏమిటి సావిత్రీ? అన్నట్లు శకారుదేడీ?

శి: (ప్రవేశిస్తూ) ఓహెూ మావఁగారూ, ఎప్పుడొచ్చారు మావగారూ?

నా: కనిపించానా నాయనా?

శి: కనిపించకేం! కనిపిస్తున్నారు మావగారూ.

నా: ఏమోలే. ''కనిపించటంలేదు'' అని పేపరులో వేయించావుట కదూ. అందుకనీ.

హే: ఒకళ్ళకొకళ్ళం కనిపిస్తున్నాంగాని-మనందరికీ బతకడానికి ఒక మార్గంమాత్రం కనబడ్డంలేదు నాన్నగారూ!

నా: మార్గం నేను చూపిస్తాగా. కాస్త ఓపికపట్టండి మరీ. ఒక్క వక్షంరోజులు ఓపిక పట్టండి. అన్ని చిక్కులూ విడిపోతాయి.

హే: అప్పటికి కొంప అమ్మకం పూర్తిఅవుతుందా?

నా: మాటాడుకుందాం. కొంపలో తిండీ తిప్పలూ ఏమైనా ఉన్నాయా?

అ: మీ దయవల్ల యింకా ఉన్నాయి.

నా: ఏ పాటు తప్పినా సాపాటు తప్పదు. పదండి. ఆనక మాటాడుకుందాం. ఇంటి యిల్లాలా! దేవుడిగంట వాయించి మాకందరికీ యింత ప్రసాదం పడేయ్!

(దేవుడి గదిలో గంట మోగుతుంది)



# రంగము 5

(పూజామందిరంలో గంట మోగుతుంది, ఆ తరవాత డబ్బా ఏదో తిరగబడిపోయిన చప్పుడు.)

అ: అయ్యో అయ్యో....నా కళ్లు పేలిపోను....ఎంత అఘాయిత్యం జరిగింది! హేమా! హేమా!

హే: (దూరంనుండి) వస్తున్నా! (దగ్గరగావచ్చి) ఏవఁమ్మా?

అ: ఇంకా ఏఁవఁమ్మా అంటావేమిటే నా తల్లీ! చూడవే....

హే: అయ్యో, పెసలడబ్బా కిందపడిపోయింది. ఎవరే యీ పని చేసిందీ?

అ: ఇంకెవరమ్మా....ఇలా హారతిచ్చి గంట వాయించానో లేదో—

హే: సావిత్రా?

సా: (ప్రవేశిస్తున్నట్లు) అయ్యో ఏమిటి యీ పెసలన్నీ? డబ్బా తిరగబడి పోయిందా?

హే: కళ్లు నెత్తిమీద పెట్టుకు నడిస్తే ఏమవుతుంది మరీ....

సా: అ—వ్వ! నేనా? కళ్ళు నెత్తిమీద పెట్టుకు నడిచానా?

అ: నిన్నెవరన్నారు తల్లీ....అప్పుడే నోరు పెట్టుకు పడిపోతున్నావ్?

సా: అ—వ్వ! నేనా? నోరు పెట్టుకు పడిపోతున్నానా?

హే: మరి లేకపోతే ఏమిటీ? నిన్నెవరన్నారిప్పుడూ?

(దూరంనుంచి హేమా హేమా అని కేక)

హే: హేమా హేమా....ప్రాణాలు హరీ అనేదాకా యీ పిలుపు ఒదల్దు నాకు.

శి: (ప్రవేశిస్తూ) హేమా హేమా....పోస్టువాడూ—అరె, ఇదేమిటి—పెసలన్నీ యిలా ఒలికిపోయాయి?

హే: డబ్బా తిరగబడితే వొలికిపోవుటండీ మరి!

శి: మరే. నాకు తోచనేలేదు. అయితే డబ్బా ఎలా తిరగబడి పోయిందీ?

సా: ఏవుందీ....నేను గబగబావచ్చి భడీమని కాలితో తన్నేశాను, కావాలని. అంతేగా?

అ: చూశావా చూశావా....ఎలా కొండేలు చెపుతోందో....అసలే డబ్బా తిరగబడిపోయిందని నే నేడుస్తూంటే—

హే: బాగుంది వరస. దీనిక్కూడా ఏడుపేనా అమ్మా!

సా: ఓదార్చేవాళ్లుంటే సరి-ఎంతసేపైనా ఏడవొచ్చు, దేనికైనా ఏడవొచ్చు.

శి: డబ్బా ఎలా పడిపోయిందత్తయ్యగారూ?

అ: ఏంచెప్పను నాయనా. మహలక్ష్మికి ఇలా హారతిచ్చి గంట వాయించానో లేదో—

శి: లేదోనా? లేకపోవడమేమిటి-ఫైరింజను గంటలా వాయించారు, నే విన్నాలెండి.

అ: ఇంతలో ఎక్కణ్ణించొచ్చిందో-శనిలాగా—

శి: ఎవరూ?

అ: ఇంకెవరు నాయనా....పందికొక్కు....ఇం—త పందికొక్కు!

శి: పాపం, మీ గంట విని హడలిపోయుంటుంది. నేనే హడలి పోగా లేనిది....

హే: ఆహా....పందికొక్కుమీద ఏంజాలి! ఏంజాలి! అందులో సగం జాలి కట్టుకున్న పెళ్ళాంమీద చూపిస్తే బాగుండిపోను.

సా: ఈ కొంపలో ఒకళ్ళమీదొకరికి జాలొకటీ! జాలి-జాలి, కళ్ళు నెత్తిమీద కెళ్ళాయా? శనిలాగ లోపలికొచ్చానా?

అ: గడుసుతనం అంటే అలా వుండాలి. ఇంక ఊరుకుంటావా నా తల్లీ?

హే: ఎందుకూరుకుంటుందీ? అలా ఊరుకుంటే మనం సుఖపడి పోమూ?

సా: మరే. మీ సుఖానికి నేనే అడ్డొస్తున్నాను. ఏం? రోజులు దగ్గరకొస్తున్నాయి లెండి-బెంగపడకండి. నేనీ కొంపలోంచి పోతేగాని అందరికళ్ళూ చల్లబడవు. ఆగండి-పోస్టువాడొచ్చేదాకా కాస్త ఆగండి.

హే: ఏమవుతుంది పోస్టువాడొస్తే?

సా: అయిందేదో అవుతుంది, తొందరపడకండి. అప్పుడే చూద్దురుగాని.

శి: నేనూ అందుకే చూస్తున్నాను-పోస్టువాడికోసం. హేమా.... ఓసారిలా వస్తావా? నీతో మాటాడాలి.

హే: మాటలు-మాటలు-మాటలు! ఎన్నాళ్ళు మాటాడినా ఎక్కడికి తేలతాం?

శి: అంటే?

హే: అంటే ఏమిటో నాకు తెలీదు. మీకూ మీ పెద్దలకీ వెయ్యి వేల నమస్కారాలు. నన్నిలా వదిలెయ్యండి, అంతేచాలు. మీ యిష్టం వొచ్చినట్టు చేసుకోండి-నాతో ఏం మాటాడక్కర్లేదు! మాటాడింది చాలు.

శి: ఎందుకు చెపుతున్నానో విను హేమా, ఒక్కసారి అలా రా.

హే: రాను బాబూ....రాను. మీరు చెప్పవలసిందేమిటో యిక్కడ చెప్పండి.

శి: అంతేనా? అనక నేనేంచేసినా నువ్వేమీ అడక్కు.

హే: అడగను. ముమ్మాటికీ అడగను. మీ యిష్టం వొచ్చినట్టు చేసుకోండి. మీకు ఏది ధర్మం అని తోస్తే అది చెయ్యండి. ఇక వెళ్లండి-యిక్కణ్ణించి!

శి: సరే. ఆనక విచారిస్తావు!

హే: ఏమీ విచారించను. పీకదాకా మునిగిపోయాక యింక చలేమిటి? హుఁ.... బెదిరిస్తున్నారు, బెదిరింపు. అంతేగా మన ప్రయోజకత్వం.

అ: అందరి ప్రయోజకత్వాలూ ఒకలాగే ఏడ్చాయి తల్లీ. ఎవర్నను‌కొని ఏంలాభం? నా తల్లీ, సావిత్రీ.... పొయ్యిమీద ఎసరు పెట్టాను-ఒక్కసారి వెళ్ళి ఎలా ఉందో చూసొస్తావా?- పొద్దుణ్ణించీ ఒకటే గుండెదడ.... ఆయాసం....

సా: నే నెందుకు-శనిలాంటిదాన్ని! చాకిరీకి నేనూ, అధార్టీ చెలాయించడానికి కూతురూనా? అందితే జుట్టూ అందకపోతే కాళ్ళూ రకం అంతా. ఛీ.... ఏం మనుషులు.... ఏం మనుషులు!

హే: అనుకో.... అనుకో - నీ యిష్టం వచ్చినట్టు అనుకో. నీ నోటికి అడ్డేమిటి? వాణ్ణి వలలో వేసేసుకున్నావ్-అంచేత ఎన్ని ఆటలేనా ఆడతావ్-నీకేం?

సా: వలలో వేసుకున్నానా? నేనా? అరుగో ఆయనే వస్తున్నారు-అడిగి యిదేదో తేల్చేస్తానుండండి. ఏమండీ....

గో: (ఒగురుస్తూ) హమ్మయ్య..ఏం? మళ్ళీ ఏం కొంపమునిగింది?

సా: ఏమండీ.... మిమ్మల్ని నేను వలలో వేసుకున్నానా?

గో: మొదలా.... చచ్చిచెడి ఊరంతా తిరిగొచ్చాను! అడుగు పెట్టానో లేదో రగడ ప్రారంభం!

హే: అవసరమైందేమో తిరిగావ్. ఏం మమ్మల్ని ఉద్ధరించడానికి తిరిగావా?

గో: కాకపోతే? మిమ్మల్ని ఉద్ధరించడానికే తిరిగాను. లేకపోతే నా ఒక్కడికే పట్టిందా యీ బాధంతా? రేప్పొద్దున్న మీరంతా చెట్టుకింద ఉంటారా?-ఇదేమిటీ-యీ గది నిండా యీ పెసలేమిటి?

సా: దానికే యిందాకటినుంచీ రగడ జరుగుతోంది. కావాలని నేను తిరగబోసానట. ఎంత బాసంవో చూశారా? పైగా నేను మిమ్మల్ని వలలో వేసుకున్నానని—

గో: అబ్బ—ఊరుకుంటూ గొడవ.

హే: గొడవేవిట్రా....యిందాకటినించీ మమ్మల్ని నానా మాటలూ అంటూంటేనూ....

అ: పెసలన్నీ ఒలికిపోయి నే నేడుస్తూంటే—

గో: ఒలికిపోతే మళ్ళీ డబ్బాలోకెత్తక యీ రంధి అంతా దేనికే?

సా: అది మాత్రం ఎవ్వరూ చెయ్యరు. అలా సర్దుకుపోతే కొంపలో యింక కావలసిందేమిటి?-

అ: అయితే నాన్నగారి పట్టుదల ఖాయమే నంటావురా గోపాలం?

గో: వెర్రిదానా? ఇంకా పెరటిదారిలోనే ఉన్నావా? ఎల్లుండి శరభయ్య వస్తూంటే! ఆ మర్నాడే రిజిస్ట్రీ!

హే: ఆ మర్నాడు మనందరంవెళ్ళి గంగలో దూకడం! అంతేనా?

సా: గంగ యిక్కడికి చాలాదూరం. రైలుటిక్కెట్టే యాభైరూపాయలదాకా ఉంటుంది.

హే: చాల్లే నేర్చుకు పోయావ్ మాటలు!

గో: ఉండుండు. ఏది సావిత్రీ, నీదగ్గిర ఆ యాభైరూపాయలూ ఉన్నాయా? లేకపోతే మీ నాన్నకి ఉత్తరంరాసి తెప్పించు—అవి పట్టుకు వెళ్లి గంగలో దూకుదువుగాని....

సా: అంతఖర్మ నాకు పట్టలేదు. కావాలంటే మీరంతా వెళ్ళి దూకండి. నాకేం?

అ: నీ నోటిధర్మవాఁ అని అలాగే జరిగేట్టుందిలే తల్లీ!

గో: అంటే ఏవిఁటమ్మా నీ ఉద్దేశం?

అ: ఏవుంది నాయనా? ఈ కొంపకాస్తా అమ్మేశాక గంగలో దిగడమే నాకింక గతి. మళ్ళీ ఏ మొహంపెట్టుకు అద్దెకొంపల్లో కాపరం చెయ్యను? అంతా ఏడుకొండలవాడి దయ. వినాశకాలం కాకపోతే నిక్షేపంలాంటి కొంప అమ్ముకోవడం ఏఁవిటి?

హే: అదెంతా వాడికెందుకూ? మహరాజుతో మొరపెట్టుకొంటే మరిరెండు దెబ్బలు కొట్టమన్నాట్ట. అలా ఉంది.

గో: అంటే ఏమిటి హేమా నీ ఉద్దేశం?

హే: ఉద్దేశాలకేముందిరా, నా తలకాయ! కొంపమ్మేయడానికి నాన్నకంటే నీకే ఎక్కువ హడావిడిగా ఉంటే!

గో: కొంప అమ్మడం అమ్మకపోవడం నా చేతిలో ఏముంది? అంతా ఆయనగారి దయాధర్మ బిక్ష.

హే: మొన్నటిదాకా అమ్మొద్దని నాన్నతో శతపోరినవాడివి, యింతలో ఏవొచ్చిందని యిలా మారిపోయావూ?

సా: ఆయన్ని పట్టుకు ఉతికి ఝాడిస్తా వెందుకూ? ధైర్యం ఉంటే వెళ్లి మీ నాన్నగారిని అడుగు!

హే: అంత చాకచక్యం ఉంటే నాగతి యిలా ఉండడమేం? అంత జాణాతనం లేదు నాదగ్గిర. నేనేం నీలా చదువుకున్నదాన్నా? ఉద్యోగం చేసినదాన్నా?

సా: మాటాడితే అదో దండకం. మీరేం మాటాడరేవండీ? బెల్లం కొట్టిన రాయిలా అలాచూస్తూ ఊరుకుంటారేం?

గో: ఊరుకోక ఏం చెయ్యను? ఉరెట్టుకోనా?

అ: అంతేకాని—నాన్నతో చెప్పి కొంప అమ్మకం ఆపుచెయ్యలేవురా?

గో: అది నాతరంగాదు. నే నెంతచెప్పినా ఆ రావణాసురుడు వినడు. అదీగాక అమ్ముకుంటే అమ్ముకోనీ—నాకేం మధ్యనా?

అ: అదేమిట్రా అలా అంటావ్? ఉత్తరోత్రా నీకే కదురా నష్టం? నాయనా ఏడుకొండలవాడా...అందరూ నన్నుద్ధరించినట్లే మాటాడుతారు తండ్రీ. పెంచి పెద్దవాణ్ణి చేసినందుకు యిదీ కొడుకుచేసేనిర్వాకం.

హే: ఈ కొంపలో అందరూ అంతే. సమయం వచ్చేసరికి ఎవరి స్వార్థం వాళ్ళు చూసుకుంటారు.

గో: ఇందులో నా స్వార్థం ఏముందీ?

సా: అంటే ఆమాత్రం అర్థంకాలేదూ? ఈ కొంపలో మనిద్దరం ఉండడమే స్వార్థం అన్నమాట.

హే: ఉన్నమాట చెప్పావు సావిత్రీ! విన్నావా అన్నయ్యా నీ భార్యారత్నం మాటలు? నేనన్నదీ సరిగ్గా అదే....

గో: ఏమిటీ నువ్వన్నదీ?

హే: ఏవుందీ? ఆవిడగారు నూరిపోసింది నీకు పూర్తి తలకెక్కిందీ! ఎలాగైనా కొంప అమ్మించేసి, భాగాలు పంచేసుకుని వేరింటి కాపరం పెట్టాలని ఆవిడగారి ఎత్తు....అంతేలే....అందరూ బాగానేవుంటారు. ఎటొచ్చీ దిక్కులేనిదాన్ని నే నొకత్తెనే. పుట్టిల్లుచూస్తే యిలాఉంది. అవ తల కట్టుకున్నాయన వైఖరిచూస్తే అలావుంది. పోనీ ఏదైనా ఉద్యోగం చేసి నాబతుకు నేను బతుకుదామా అంటే అందుకూ పనికిరానాయె.... మళ్ళీ చెప్పకొందుకి అంతా ఉన్నారు....తల్లీ....తండ్రీ....అన్నయ్యా, కట్టుకున్న భర్తా....ఏంలాభం, (ఏడుస్తూ) అందరూ కలిసి అన్నివిధాలా నా గొంతుకోశారు.

సా: బుడిబుడి దుఃఖాలు అందరికీ చాతనవును—కావలిస్తే. ఇప్పుడేమంటావ్?....అందుకని యీ జన్మకి వేరే మా సంసారం మాకు లేదన్నమాట. వేరే పోతామన్నా తప్పే?....పొద్దస్తమానం ఇలా దెబ్బ లాడుకుంటూ చచ్చేకన్నా విడివిడిగా ఎవరి ఏడుపు వాళ్ళేడిస్తే నయం కాదూ?

అ: అందుకని సంసారాన్ని చీలదీస్తావా?

సా: నేనేం చీలదీయలేదు. ఈ కొంపలో నేను అడుగుపెట్టేసరికే ఈ సంసారం అన్నివిధాలా బీటలు వేసిఉంది. ఇవేవీ తెలియక మా నాన్న నా గొంతుక్కోశాడు. ఛీ....ఇది కొంపో అడివో తెలియడం లేదు.

హే: సమాధానం చెప్పవేంరా....పెళ్ళాం అడుగుతూంటేనూ?

గో: (వినుగ్గా) నే నెవరికీ సమాధానం చెప్పలేను. ఎవరిష్టం వొచ్చినట్టు వాళ్ళు చెలరేగండి. నాకేం....ఏదెలా జరగాలో అలా జరుగుతుంది.

అ: జరుగుతుంది నాయనా....నాకేం కాళ్ళూ చేతులూ ఆడడం లేదు మహాప్రభూ....ఆ ఏడుకొండలవాడు రక్షించి సాయంత్రం బండికి మా అన్నయ్య వచ్చేస్తానా?

గో: అదేవిఁటీ?....మావయ్యకిగాని ఉత్తరం రాశావా రమ్మని?

హే: రాయర్రా మరీ....ఆపదొచ్చినప్పుడు ఎవరి కాళ్లైనా పట్టుకోవాలి....

గో: ఆఁ....ఏమిటీ? మావఁయ్యకి ఉత్తరం రాశారా? మావయ్యకీ?

అ: అందులో తప్పు ఏవుందిరా?

హే: నీకు పిల్లనివ్వక పోయినంతమాత్రాన పేగుసంబంధాలు పోతాయట్రా?

సా: ఆ మావయ్య పిల్లనిచ్చేసినా బాగుండిపోయేది....

గో: నీకు హాయిగా ఉండేది....ఏం?

సా: ముమ్మాటికీని....అనుకోడం కూడా తప్పే?

గో: అబ్బే....ఏం తప్పులేదు. ఇప్పుడైతే మాత్రం మించిపోయిందేవుందీ? ఈ క్షణంలో కాపరం ఒదులుకు నువ్వు పుట్టింటికి వెళ్ళొచ్చు.

సా: నిక్షేపంలా వెళతాను, సాయంత్రం బండికి మా అన్నయ్యొస్తే రాత్రి బండికే వెళిపోతాను. సరేనా?

హే: తలపెట్టిన పని అయిపోయిందీ! ఇంక వెళ్ళక ఏం చేస్తావు?

సా: మరే—ఏవిఁటా తలపెట్టిన పని?

హే: మరేవుందీ? కొంప అమ్మించేయడం.

సా: అనుకోండి....అనుకోండి...మీ యిష్టంవొచ్చినట్టు అనుకోండి. నేనూ పోస్టుకోసం చూస్తున్నాను....అన్నయ్యేనా రావాలి....మనియార్డరేనా రావాలి....

(హేమా హేమా అని తండ్రి కేక)

నా: (ప్రవేశిస్తూ)హేమా....(కంఠం మార్చి) ఓహెూ అందరూ యిక్కడే ఉన్నారూ. ఏమిటి గూడుపుఠాణీ? మళ్ళీ ఏదైనా శాంతి తలపెట్టారా?

సా: మనకొంపలో యుద్ధం తప్ప శాంతి ఎప్పుడూ లేదుగాని....

నా: పోనీలే చిట్టితల్లీ....మనకంటె గొప్పవాళ్ళే యుద్ధాలు చేస్తున్నారు....దానికేం గాని....అవరాహ్నం దాటింది....కొంపలో తిళ్ళూ తిప్పలూ ఏవైనా ఉన్నాయా?....

సా: ఈ పూట వంటలేదు మాఁవయ్యగారూ!

నా: లేదా?....మరీ మంచిదీ....ఓ పూట బియ్యం అవీ మిగులూ....

అ: మీ వాలకం చూస్తేనే కడుపు నిండిపోతోంది. మళ్ళీ వేరే తిండెందుకు? అవునుగాని—

నా: అవునుగాని....ఏమిటి?....చెప్పూ?....

అ: ఇల్లు అమ్మేయడం ఖాయమేనా?

నా: ఆహా....బ్రహ్మ రుద్రాదు లొచ్చినా అడ్డలేరు. ఏం?

గో: అవునా. ఆ మాత్రాని కందరూ నామీద విరుచుకు పడుతున్నారు....యీ కొంపలో నాకో పలుకుబడంటూ ఏడ్చినట్లు.

హే: ఆ మాత్రానికి ఎందుకు కట్టించినట్లు నాన్నా యీ కొంప?

నా: బుద్ధితక్కువ హేమా? కేవలం బుద్ధి గడ్డితినీ కట్టించాను. ముప్పై ఎనిమిదివేలు....బూడిదలో పోసిన పన్నీరు! ఆ శరభయ్యగాడి ధర్మమా అని బతికిపోయాను గాని....

అ: అవును....మీరొక్కరు బతికిపోతే చాలు....సంసారమంతా నట్టేట్లో కలిసినాసరే....అంతేనా?

నా: అలా ఎందు కనుకోవాలీ? కొంపకట్టకపూర్వం ఏంచేశారూ?

అ: కక్ష....కక్ష....ఎందుకో మీకు పెళ్లాం పిల్లలమీద అంత కక్ష?

నా: అందుకేగా....అన్నదమ్ములికి చాటభారతంలాంటి ఉత్తరం రాశావ్?

అ: మీకెలా తెలిసిందీ?

నా: సమాధానం రాశాడుగా....ఇందాకా పోస్టువాడు తెచ్చిచ్చాడు. సాయంత్రం బండికి దిగబడుతున్నాట్ట.

సా: పోస్టొచ్చిందా? నాకేమైనా ఉత్తరాలొచ్చాయా మావయ్యగారూ?

నా: ఈ కొంపలో ఉత్తరాలకేం తక్కువ చిట్టితల్లీ....ఏం? నీకూ అలాంటి ఉత్తరాలేమైనా రావాలా?

సా: ఒచ్చిందో లేదో చెప్పకూడదా?

నా: నాకేం పట్టింది చెప్పేదాకా?....నువ్వు రాసుకున్న ఉత్తరాలన్నీ నాకు చెప్పే రాశావా?

గో: మావయ్య దిగబడుతున్నాడా నాన్నా?

నా: ఆహా....దిగబడుతున్నాట్ట మరి. ఇంటి యిల్లాలు ఉత్తరం రాయించిందిగా!

గో: ఆయనగారు ఈ కొంపలో అడుగుపెడితే నేనొప్పకోను.

అ: ఏవిఁరా నాయనా....మేనమామ అంత చేదువిషం అయాడా నీకు?

గో: మెల్లిగా అంటావ్?....మే-న-మా-మ-! అంతా నన్నుద్ధరించే వాళ్ళే.........

అ: బాగుంది నాయనా బాగుంది....తండ్రీ కొడుకుల వరస చాలా బాగుంది. నాయనా, ఏడుకొండలవాడా!....ఇలా అయితే నేను ఏ నుయ్యో గొయ్యో చూసుకోవాలి గాని!

నా: నిరభ్యంతరంగా చూసుకో....ఎటొచ్చీ నాలుగురోజులాగు.... ఈ కొంపలో నుయ్యి లేదాయె మరి....ఒరే గోపాలం?....

గో: ఏం నాన్నగారూ?

నా: అద్దెకొంప చూసేటప్పుడు కాస్త నదుపాయమైన నుయ్యున్నది చూడూ....మీ అమ్మ హాయిగా అందులో దూకుతుంది.

హే: అయ్యొయ్యో....ఏవిఁటీ అఘాయిత్యం మాటలూ. మీరంతా మనుషులా పశువులరా....నాన్నగారూ....నాన్నగారూ....

అ: అననీ అమ్మా అననీ....అందరికీ అంత బరువై పోయాను నేను. కాపరాని కొచ్చిందగ్గిర్నించీ ఒళ్లు హూనం అయేట్టు అందరికీ చాకిరీలు చేసి పెంచి పెద్దవాళ్ళని చేసి-ఛీ....(ఏడుస్తుంది) ఏమండీ.... ఆఖరుసారి చెపుతున్నాను. యీ కొంప అమ్మితే నేను....నేను నూతిలో దూకి తీరుతాను....తెలిసిందా. ఇలా యీడ్చుకుంటూ బతికేకంటె....

నా: (కంఠం హెచ్చించి) నువ్వు నూతిలో దిగినా సరే, అందరూ కలిసి గంగలో దిగినా సరే....యీ కొంప అమ్మితీరుతాను....తెలిసిందా!

అ: సరే....(ఏడుస్తూ) నాయనా ఏడుకొండలవాడా....రక్షించు తండ్రీ....ఈ క్షణంతో నాకీ భూమ్మీద నూకలు సరీ....ఇంక తీసుకుపో తండ్రీ! ఇంక పడలేను యీ సంసారంలో నరకం....(వెక్కి వెక్కి ఏడుస్తుంది) ఎంత చేసినా-ఎంత ఓర్పుతో పడున్నా-కట్టుకున్న ఆయన, కను

కొన్న కొడుకు-అంతా....అందరికీ నేను శత్రువునే అయాను. (కంఠం మార్చి) ఇదిగో ఇప్పుడే వెళుతున్నాను. వెళ్ళి ఆ రామాయమ్మగారి నూతిలో నన్నా దూకుతాను. ఏడుకొండలవాడా....శ్రీరామచంద్రా (ఏడ్చుకుంటూ వెళుతుంది.)

హే: (ఏడుస్తూ) అమ్మా!....అమ్మా!...అయ్యో!....ఏం దారిప్పుడు నాకు! ఏవిఁరా గోపాలం? చూస్తూ ఊరుకుంటావేఁవిరా...కనుకొన్న తల్లిరా. అంత రాక్షసుడివిరా నువ్వూ.

గో: ఏవిఁ సంసారం....ఏవిఁ సంసారం....అమ్మా....అమ్మా.... (అని అరుచుకుంటూ వెళతాడు)

హే: అమ్మా....అమ్మా....(అని అరచుకుంటూ వెళుతుంది)

నా: వెళ్ళండి .... అంథా వెళ్ళండి .... కట్టుకట్టుకు నూతిలో దూకండి....శని విరగడైపోతుంది.

(తలుపుకొట్టిన చప్పుడు)

సా: వస్తున్నా....ఆఁ....మావయ్యగారూ....అదిగో అత్తయ్యగారి అన్నయ్య కాబోలు వచ్చారు!

నా: (ఉలిక్కిపడి) ఆఁ....ఆఁ....వాడే....వాడే....హారి పరమేశ్వరా ఏం దారిప్పుడు నాకు? నేను గూడా ఏ నూతిలోనన్నా దూకనా... హారి పరమేశ్వరా....వీడిప్పుడే దాపురించాలా?!



# రంగము 6

(నేపథ్యంలో ''వోయ్ బండబ్బీ! ఆ సామాను అదిగో—ఆ మూల పెట్టు. ఇంద నీ డబ్బులు'' అనే మాటలూ, ఆ తరువాత జోళ్ళు ముందుకు నడుస్తున్నట్లూ వినబడతాయి.)

నా: హరి పరమేశ్వరా! ఎటువంటి సమయంలో దిగబడ్డాడు వీడు! ఇప్పుడేం దారినాకు! అవతల యిల్లాలు నూతిలో పడుతుంది. (కంఠం మార్చి) ఆఁ....రావోయ్ బావా, రా! ఏ బండికి రావడం? అంతా కులాసాయేనా?

బావ: ఆఁ....అమాంబాపతు అంతా కులాసాయే. నువ్వేం అలా ఉన్నావ్?

నా: ఎలా ఉన్నానూ? నాకేం? నిక్షేపంలా ఉన్నాను? ఏం? ఎందుకలా అంటున్నావ్?

బా: ఆఁ....ఎందుకేమిటి? నీ వాలకంచూస్తే వింతగా ఉంది. అన్నట్లు మనవాళ్ళంతా ఏరీ? ఇల్లు ఇంత నిశ్శబ్దంగా ఉందేం? చెల్లేదీ? పిల్లలేరీ?

నా: మీ చెల్లెలు పక్కింటి కెళ్లింది కాబోలు... అబ్బాయి ఇంత సేపూ ఇక్కడేఉండాలి మరి....

బా: హేమా?....హేమేదీ....అదిగో సావిత్రి! రా సావిత్రీ....రా.

సా: ఓ....బాబయ్యగారూ, ఎన్నాళ్ళ కెన్నాళ్ళకి బాబయ్యగారూ! అంతా కులాసాయేనా?

బా: కులాసాకి అంతెక్కడ తల్లీ....మీ అత్తయ్యేదీ?

సా: ఒస్తున్నారు బాబయ్యగారూ. పక్కింటి కెళ్ళారు. నిలుచుండి పోయారేం? ఆ కుర్చీలో కూర్చోండి. మంచినీళ్ళు కావాలా?

బా: ఒద్దమ్మా....నా దాహంరోజులు గడిచిపోయాయి. మీ ఆయనేడీ?

సా: ఒస్తారు బాబయ్యగారూ, ఒక్కక్షణంలో అందరూ వస్తారు. అలా కంగారు పడతారేం? కాళ్ళు కడుక్కుందికి నీళ్ళివ్వనా?

బా: అయ్యో నీ మర్యాదలు బంగారంగానూ, వాటికేం తొందరొచ్చింది సావిత్రీ? మనవాళ్ళందరూ ఎక్కడ దాక్కున్నారు? రారేం? ఏం బావా?....ఏమి టాలోచిస్తున్నావ్? బావమరిది ఇంటికొస్తే అలా బెల్లం కొట్టిన రాయిలా మాటాడవేం?

నా: హారి పరమేశ్వరా! నువ్వూ అలాగే మాటాడుతున్నావ్? నేను ఏవఁన్నాననీ ఇప్పుడూ?

బా: ఏవీఁ అనలేదు. అందుకే ఏమైనా అనమంటున్నాను. ఎందుకలా మొహం ముడుచుకు కూర్చున్నావ్? ఒళ్ళు బాగాలేదా?

నా: ఒంటికేం నిక్షేపంలాఉంది. నవరత్న ఖచితంగా ఉంది.

బా: పోనీ—మనస్సు బాగులేదా?

నా: యీ బాగులకి అంతెక్కడ లేవోయ్? బతికున్నన్నాళ్ళూ ఉండేవేగా?

బా: (నవ్వుతూ) బావా, నాటికీ నేటికీ ఒక్కలా ఉన్నావు. రవ్వంత మార్పులేదు. సరేలే యిప్పుడు నీ బెంగంతా నేనొచ్చానని కాదు గదా కొంపతీసి! భయపడకు! సాయంత్రం బండికి వెళ్ళిపోతాలే.

నా: రామరామ. ఇప్పుడు నేను వల్లెత్తుమాటేనా అన్నానా? మనుషులు నన్నుచూసేసరికే ఎందుకలా ఒంటికాలుమీద లేస్తారు?

బా: ఏ మనుషులు?

నా: ఇంకేమనుషులు? యీ కొంపలో వాళ్ళంతానూ.

బా: కొంపలోవాళ్లు! ఏమిటో నీధోరణి నాకేం అర్థం కావడం లేదు. నువ్వేమో యిలావున్నావు—ఇంట్లోచూస్తే తక్కిన వాళ్లెవరూ కనబడ్డంలేదు. ఏం సావిత్రీ?....

సా: ఏం బాబయ్యగారూ?

బా: అసలు సంగతేవిటో కాస్త నువ్వేనా చెబుదూ, ఇంట్లో అందరూ పోట్లాడుకున్నారా?

సా: ఈ కొంపలో పోట్లాటలేని దెప్పుడు బాబయ్యగారూ?

బా: ఏమిటో నాకంతా అగమ్యగోచరంగా ఉంది. పోనీలే, అన్నీ క్రమంగా అవే తెలుస్తాయి గాని—మీ అత్తయ్యను కేకేసుకురద్దూ. ఏం చేస్తోంది పొరుగింట్లో?

నా: (చిరాగ్గా)ఏం చేస్తోంది? సంసారం రచ్చకెక్కిస్తోంది. దానికి చేతనయిందల్లా అదేగా?

సా: మన సంసారం ఏ నాడో రచ్చకెక్కింది మావయ్యగారూ! ఇవాళ కొత్తేముందీ?

బా: సావిత్రీ....చదువుకున్నదానివి నువ్వుకూడా అలా పాటుకు మాటలు మాటాడితే ఎలా?

నా: చదువుకుంటే మాత్రం ఆడలక్షణం ఎక్కడికిపోతుంది? అంతా నేను చేసుకున్న ఖర్మ....

సా: మీకేం మావయ్యగారూ ఖర్మంతా నాది. ఏ క్షణాన యీ కొంపలో కొచ్చిపడ్డానో కాని—

నా: మళ్ళీమొదలు! చూశావోయ్ బావా? అహర్నిశలూ కొంపలో అంతా ఇదే వరసనుకో. క్షణక్షణం ఏక పోరు, నువ్వింక అడుగు పెట్టావనగా చూడవలసింది కొంప....అన్నట్టు అందుకేగా నువ్వూ దిగబడిందీ! మరచిపోయాను. ఉత్తరం రాసిందిగా....చెల్లెలు ఉత్తరం రాసింది, నువ్వు రెక్కలుకట్టుకు వెంటనే దిగడ్డావు! గజేంద్రమోక్షంలో విష్ణుమూర్తిలాగ.

బా: భయపడకు బావా! చెప్పానుగా—రాత్రిబండికి మళ్ళీ వెళ్ళిపోతానుగాని సంగతేమిటో కనుక్కుందికి వచ్చాను. అంతేగాని నీ నిధినిక్షేపాలు పట్టుకుపోవడానికి గాదు.

నా: నిధి నిక్షేపాలు! ముప్ఫైతొమ్మిది వేలుపోసి కట్టినకొంప ఇలా తగలడుతోంది. ఇక నిధి నిక్షేపాలు. అనుభవిస్తారులే నాకేమిటి మధ్య. ఒక్కగా నొక్క ప్రాణిని. ఏ శంకరమఠంలో చేరిపోయినా జరిగిపోతుంది.

బా: అనాసక్త యోగానికి ముందు నిన్నే చెప్పాలి. పరేగాని—సావిత్రీ—ఆ పొరుగిల్లేదో చూపిద్దూ, నేనే వెడతాను. వెళ్ళి చెల్లెల్ని తీసుకొస్తాను.

నా: అదొకటా. ఇప్పడయిన రంధిచాలక నువ్వుకూడా యిరుగిళ్ళకీ పొరుగిళ్ళకీ వెళ్ళి టముకువెయ్యాలీ? పోవాలి. నా పరువు ప్రతిష్ఠలన్నీ గంగలో కలిసిపోవాలి. అప్పడుగాని మీ కెవ్వరికీ నిద్దర్లు పట్టవు! ఏం?

బా: హూ....బాగుంది వరస. బావా, నీకు వయస్సు గడిచింది గాని—ఇవరముల్లంత ఇంగితజ్ఞానం రాలేదోయ్. ఎప్పడూ నువ్వు సుఖపడవ్ ఇతరుల్ని సుఖపడనియ్యవ్....

సా: సుఖంసంగతి దేవుడెరుగు. మనశ్శాంతి నిలుస్తేచాలు బాబయ్యగారూ. ఈ కొంపలో దానికీ నోచుకోలేదు. అదిగో అత్తయ్యగా రొస్తున్నారు....

అ: (ప్రవేశిస్తూ) ఏం అన్నయ్యా? ఒచ్చావా నా తండ్రీ....సమయానికి దేవుడిలా ఒచ్చావు బాబూ....

బా: నీ ఉత్తరం చూసుకోగానే బయలుదేరాను చెల్లెమ్మా....అదేమిటి అంత నీరసంగా ఉన్నావ్? ఏం హేమా! నువ్వేం మాటడవేం?

హే: మాటాడ్డానికి ఏవుంది మావయ్యా! చావబోయేవారికి మాటలేవుంటాయి?

బా: బాగుంది! పలకరింపంటే అలా ఉండాలి!

అ: ఏం పలకరింపు నాయనా! నువ్వురావడం యింకొక్క క్షణం ఆలస్యం అయుంటే—నీ చెల్లెలు కాస్తా హరీ మనేది.

నా: నేచెప్పలేదోయ్ ఇందాకా? గజేంద్రమోక్షం! సాక్షత్తూ విష్ణు మూర్తిలా దిగబడ్డావు! లేకపోతే నీ చెల్లెలూ, మేనగోడలూ, మేనల్లుడూ, అందరూ ఉరెట్టుకు ఛచ్చేవారు.

అ: చూశావా అన్నయ్యా! చూశావుగదా! అహర్నిశలూ అదే వరస. (ఏడుపు గొంతుకతో) అందుకే నూతిలోపడి చస్తానన్నాను.

నా: అంటావంటావ్....అంత చావాలనుకున్నదానివి రక్షించండి బాబోయ్ అని వాళ్ళకీ వీళ్ళకీ ఉత్తరాలెందుకూ? హాయిగా ఛావలేక పోయావ్?

అ: ఛస్తానులెండి మీకళ్ళు చల్లగా. అందుకనే వెళ్ళాను. ఇదిగో యిదే....యీ హేమ-యిదే నన్ను చావనిచ్చిందిగాదు. అడ్డుపడింది.

హే: ఏం చెయ్యమంటావమ్మా .... పాపిష్టిదాన్ని. విన్నావా మావయ్యా. ఇదీ వరస. ఇదీ మా కొంప. చూస్తున్నావా?

బా: చూస్తున్నాను హేమా. కాని నాకేం బోధపడ్డంలేదు.

హే: బోధపడ్డాని కేవుంది మావయ్యా! యీ నరకం భరించలేక అమ్మ నూతిలో దూకడానికి సిద్ధమైంది. హడలిపోయి నేనూ అన్నయ్యా వెనకాల పరిగెట్టాం. ఇంతలో నువ్వొచ్చావని తెలిసింది.

బా: గోపాలవేఁడీ?

హే: వాడొకడూ—మా ప్రాణాలు తియ్యడానికి!

బా: అది సరేలే. అసలు ఏడీ వాడు?

హే: ఏమోమరి. మాతోటే కొంపలో కొచ్చాడు. ఇంతలో ఏమయి పోయాడోమరి. (బిగ్గరగా) అన్నయ్యా....ఒరేయ్ అన్నయ్యా....మావయ్యొచ్చేడ్రా....

బా: ఉండుండు. అలా కేకలెయ్యకు. వాడే ఒస్తాడులే. నా ఎదుట పడడానికి వాడికిష్టం లేనట్టుంది.

హే: ఇష్టంకాదూ నా తలకాయాకాదూ....మొహంచెల్లకా....అను.

సా: అంత మొహం చెల్లనినేరం ఏం చేశారాయనా? నన్ను కట్టు కోడమేనా ఆ నేరం?

హే: నిన్నెవరన్నా రిప్పుడూ? నీ ఊసేనా ఎత్తేనా నేనూ? చూస్తున్నావా మావయ్యా...అందరికీ నేను ఎంతలోకువో చూశావా యీ కొంపలో!

సా: తెలుస్తూనే ఉంది. ఎవరికెవరు లోకువో. ఎంత లోకువ గాకపోతే, ఇప్పుడింకా కొంపలో అడుగు పెట్టారో లేదో-అయనతో కూడా మా మీద చాడీలా? అనుకోండి అనుకోండి! ఇంకెంత సేపు? సాయంత్రం బండి ఎక్కేస్తే అందరికీ శని విరగడౌతుంది.

అ: ఎవరమ్మా శని నీకు? అత్తవారిల్లు శనా?

హే: అనుకోనీ. ఎవరిఖర్మాన వాళ్ళే పోతారు.

సా: పోక? లేకపోతే చూరుపట్టుకు వెళ్ళాడుతారా?

బా: అదంతా ఎందుకుగాని సావిత్రీ-గోపాలాన్ని కాస్త యిలా రమ్మందూ!

సా: తప్పకుండా రమ్మంటాను. నాకేం పోయింది మధ్య! (బిగ్గరగా) ఏమండోయ్, ఇదిగో, మిమ్మల్నే, ఓయ్! (అని అరుచుకుంటూ వెళ్ళిపోతుంది.)

బా: అవునుగాని బావా!

నా: ఓయ్....ఏం మహానుభావా? ఏం శలవ్?

బా: వచ్చిందగ్గర్నించీ చూస్తున్నానూ. దీన్ని అందరూ కొంప అంటారేగాని యిల్లనరేం?

హే: అనడానికి ఇది యిల్లయితేగా! ఇది యిల్లూ కాదు, సంసారం గాదు. శుద్ధ కొంప. అంతే.

నా: అవునా. అందుకే దీన్ని అమ్మేస్తానన్నాను. అలా అంటే ఇంటి యిల్లాళ్లు మాటల్లో [illegible]టుంది.

హే: అమ్మేస్తారు! అంతేగా! నిర్వాకం. అమ్మేసి పెళ్ళాం పిల్లల్ని వీధిలో నిలబెడతారు. అదేగా నిర్వాకం! నాన్నగారికి మామీద ఎంతకసో చూస్తున్నావా మావయ్యా?

గో: (ప్రవేశిస్తూ) ఏం మావయ్యా....ఇన్నాళ్ళకి దయగలిగింది మా మీద. దారి తప్పివచ్చావా?

బా: భేషయిన మాటన్నావురా గోపాలం. మొత్తంమీద యింట్లో అంతా సమాన ఉజ్జీలు. ఎవరికీ ఎవరూ తీసిపోరు.

గో: అంటే?

బా: లేకపోతే రాకరాక యింటికొచ్చిన మేనమామని పలకరించే విధం యిదేనా గోపాలం?

అ: వాడినని ఏంలాభం అన్నయ్యా. అంతా ఆ పెళ్ళాం మహత్యం. ఏం మత్తుమందు పెట్టేసిందోగాని ఆవిడగారు గీసినగీటు దాటడు వీడు.

గో: నువ్వేమో యిలా అంటావ్. సావిత్రేమో గదిలో పడుకుని ఏడుస్తోంది, నన్ను కట్టుకున్నందుకట! ఎవరికని సమాధానం చెప్పను? ఏదైనా తరుణోపాయం నువ్వైనా చెప్ప మావయ్యా!

బా: అలా రా దారిలోకి. సరియైన ప్రశ్న వేశావు. అదీ బుద్ధిమంతుడి లక్షణం. చెల్లెమ్మా—

అ: ఏం అన్నయ్యా!

బా: అసలు జరిగిందేదో సరిగా చెప్ప. ఇపుడు మిమ్మల్ని పీడిస్తున్న బాధలేమిటి?

అ: ఏం చెప్ప నన్నయ్యా! అంతా ఆ ఏడుకొండలవాడి అనుగ్రహం. యీ సంసారం చెయ్యలేను నాయనా యింక. నన్ను ఏ కాశీయో రామేశ్వరమో పంపించేద్దు

బా: బాగుంది వరస. నీ ఉత్తరం ఎంత అర్థమయిందో - మాటలూ అంతే అర్థం అవుతున్నాయి.

గో: అర్థం అవడానికి మహా ఏవుంది మావయ్యా! నేనూ సావిత్రీ యీ కొంపలోంచి పోతే అందరూ హాయిగానే ఉంటారు.

హే: చూశావా మావయ్యా. వాడికి నామీదా మాఆయనమీదా అంత కసి! నేనేం చెయ్యను చెప్పు? అన్ని విధాలా దిక్కులేనిదాన్ని అయాను. పుట్టిల్లు చూస్తే యీ వరస. పోనీ కట్టుకున్న ఆయన ఉద్ధ రిస్తారేమో అంటే—

(హేమా.... హేమా....అని కేక)

శి: (ప్రవేశిస్తూ) హేమా....హేమా (కంఠం మార్చి) అరె, వెంకట్రావుగారు! ఎప్పుడొచ్చారు వెంకట్రావుగారూ, అంతా కులాసాయేనా?

బా: రావోయ్ శివరావ్, రా. ఎక్కడికెళ్ళావు యిందాకటినించీ?

శి: ఏం చెప్పను వెంకట్రావుగారూ?

"ఆప్తబంధువులు లేరు సౌఖ్యానుభూతి
గడచి చిరకాలమయ్యె! ఏకాకి నేను!"

అన్నట్టుగా యివాళ నేను ఏకాకిని. నిస్సహాయుణ్ణి. అంచేత ఎక్కడికైనా వెళ్ళాలి, ఏమైనా చెయ్యాలి.

బా: తెలిసింది! పోనీ ఏదైనా ఉద్యోగ ప్రయత్నం చేస్తున్నావా?

హే: చెయ్యకేం మావయ్యా. అయితే దేనికేనా కాలం కలిసి రావాలిగా?

బా: బాగుంది. బావా ఇలా చూడు!

నా: ఏం నాయనా ఏం?

భా: నువ్విలా బెల్లంకొట్టిన రాయిలా ఊరుకోవడం బాగులేదు బావా. ఏమిటాలోచిస్తున్నావు? ఏదైనా మాటాడు.

నా: మీరంతా మాటాడుతున్నారుగా. చాలు. నన్నొదిలేయండి. నా గొడవనాదీ. శరభయ్య ఎప్పుడొస్తాడా అని చూస్తున్నాను.

బా దానికేం? నిరభ్యంతరంగా చూడు!

అ: చూశావా అన్నయ్యా...నే చచ్చినాసరే కొంప అమ్మేయడానికి—

బా: అబ్బ....కాస్త నిదానించు చెల్లెమ్మా....అమ్మేస్తే అమ్మేయనీ ఇల్లు అమ్మేసినంత మాత్రాన ఏమవుతుంది?

అ: ఇల్లు కాస్తా అమ్ముకున్నాక యింకేం వుంది నాయనా?

బా: ఏవుంటుంది? డబ్బు చేతికొస్తుంది. ఎద్దైనా ఒకటేగా. కావలిస్తే మళ్ళీ యింకో యిల్లు కొనుక్కోవచ్చు, కట్టుకోవచ్చు. ఏదైనా చెయ్యొచ్చు. దీనికింత మతిపోగొట్టుకుని రాద్ధాంతం దేనికి? అమ్మేయనీ అంత సరదాగా ఉంటే!

నా: అమ్ముతానా—అమ్మి తీరుతానా! ఒకటా రెండా—నలభై వేలు పోసి కట్టాను. ప్రతి దమ్మిడీ నా కష్టార్జితం. నా యిష్టం. అమ్మే స్తాను. మధ్య మీ పెత్తన మేమిటి?

బా: అమ్మేయవోయ్ బాబూ! అమ్మేయ్. నాలుగు డబ్బులు లాభం వచ్చేలా చూసుకుమరీ అమ్మేయ్!

హే: ఆఁ....ఆ శరభయ్యకే అమ్మితే లాభం రావలసిందే.

నా: ఎందుకు రాదు? ఖరారునామా కూడా రాసేసుకుంటే!

అ: ఎంతకి?

నా: నేను చెప్పను. నీకెందుకు మధ్య?

బా: చెప్పొద్దులే, దాచుకో, పోనీ ముప్పైవేలకు పైమాటేనా.

నా: ఆఁ....

బా: చూశావా! అంచేత ఇంక మహరాజులా ఉండు. హాయిగా ఉండు. అందులో ఒక్క దమ్మిడీ ఎవ్వరికీ యివ్వక్కర్లేదు. సరేనా—

అయితే విను—రాత్రి బండికి మా చెల్లెల్ని నాతో తీసుకు వెళుతున్నాను. ఏవంటావ్?

నా: తీసుకువెళ్లు. నాకేం? నీ యిష్టంవచ్చిన చోటికి తీసుకెళ్లు.

బా: ఆల్‌రైట్! ఒక సమస్య తీరిపోయింది. ఒకటేమిటి-రెండూ-ఆ మాట కొస్తే-ఇంక హేమ విషయం. ఏం శివరావ్?

శి: ఏవండీ?

బా: నువ్వూ హేమా కూడా రాత్రి బండికి బయలుదేరండి.

శి: ఎక్కడికి?

బా: అదంతా చెప్తానుగా. మరేం కంగారు పడకు.

హే: ఎక్కడికి మావయ్యా? నేను అమ్మతోపాటే ఉంటాను. ఎక్కడికీ వెళ్ళను.

బా: అదేమిటి హేమా చిన్నపిల్లలా మాటాడతావ్! ఇలా అమ్మ కొంగు పట్టుకు కూర్చునే నీకు మతిపోయింది. తెలిసిందా? నువ్వూ శివ రావూ కలిసి యింక వేరింటి కాపరం పెట్టాలి.

హే: వేరింటి కాపరం? యీ జన్మకు అంత అదృష్టం ఒకటా?

శి: అలావద్దు వెంకట్రావుగారూ? మీతోపాటు హేమను కూడా తీసుకెళ్ళండి. నాదారి నేను చూసుకుంటాను. చూసుకుంటానేమిటి చూసుకున్నాను.

బా: ఉద్ధరించావ్! అలా వీల్లేదు నువ్వు ఏదారి చూసుకున్నా హేమ కూడా ఉండవలసిందే.

శి: ఇన్నాళ్ళూ భరించిన పరాభవాలు....

బా: మ్....మ్....మ్....మ్....కాస్సేపు ఊరుకో! నువ్వు వెంటనే వేరింటి కాపరం పెట్టవలసిందే. నీకో ఉద్యోగం చూస్తాను. వీలయినంత త్వరలో—

శి: అంతవరకూ?

బా: అంతవరకూ నిన్నెవరూ గాలికి వదిలెయ్యరులే. ఇంక ఊరుకో! సరే! ఇంక గోపాలం సంగతి. ఒరేయ్ గోపాలం....

గో: నా సంగతికేముంది మావయ్యా! సావిత్రిని పుట్టింటికి పంపించేస్తాను. నా పొట్ట గడవటానికి నాకో ఉద్యోగం ఉందిగా. ఎక్కడైనా గది చూసుకుంటాను.

అ: పండంటి సంసారం ఇలా ముక్కలవవలసిందేనా అన్నయ్యా?

శి: నేను యిదివరకే చెప్పాను అత్తయ్యగారూ—ఇది మేడివండు సంసారం అనీ.

బా: నువ్వూరుకో చెల్లెమ్మా. బావా? మీ శరభయ్య ఎప్పుడొస్తాడు?

నా. అన్నాడు మరి-రాత్రి బండికి వస్తానని.

బా: అన్నాడా. అయితే తప్పకండా వస్తాడు.

నా: ఎంచేతనూ?

బా: ఎంచేతనూ అంటావేమిటి బావా! సుఖంగా బతకడానికి అన్ని హంగులూ ఉన్నవాళ్ళు ఇలా అనుక్షణం ఒకళ్లకొకళ్ళు నరకాన్ని రుచి చూపిస్తున్నారు కాబట్టి....

అ: మెల్లిగా అంటావేమిటి నాయనా? యీ సంసారం ఓ కుంభీపాక నరకం అనుకో.

నా: ఎవరు కారణం అంటావ్ దానికి?

అ: పోనీ నేనే! సరేనా, ఇకనైనా బతకనివ్వండి యిలా.

హే: ఎందుకు బతకడం? ఆయనగారికి నువ్వూ నేనే బరువయిపోయాం.

గో: నేను మహాఅప్పుణ్ణి అయిపోయినట్లు.

శి: నా సంగతి సరే-యిల్లరికపు టల్లుణ్ణి! అంచేత కట్టుకున్న పెళ్ళానికి కూడా—

బా: ష్....ష్....ష్....ఊరుకోమన్నానా! అందరూ కాస్సేపు ఊరుకోండి. మీ అందరి పిచ్చీ నే కుదురుస్తాగా! అన్నట్టు సావిత్రేదీ? (బిగ్గరగా) సావిత్రీ?

సా: (దూరంనుంచి) ఓయ్. (దగ్గిరగా) ఏం బాబయ్యగారూ?

బా: నీకు మళ్ళీ ఉద్యోగంలో దేనిలోనైనా ప్రవేశించాలని ఉందా?

సా: అదో ప్రశ్నా? అంతకంటె కావలసిందేముంది?

బా: అయితే వివరాలన్నీ మాటాడదాం. ముందు యీ అయిదు రూపాయలనోటు పట్టుకెళ్లి ఎవరినైనా పంపించి ఆ ఎదుటి హొటల్లోంచి మనందరికీ కాఫీ, టిఫినూ తెప్పిస్తావా?

సా: ఓయస్‌గా! నవరత్న ఖచితమైన కాఫీ టిఫినూ తెప్పిస్తాను చూడండి.

బా: వెరీగుడ్. ఆడపిల్లంటే అలా ఉండాలి! దూసిన కత్తిలాగ! ఏమంటావు బావా?

నా: ఏమో నాయనా, చూడగా చూడగా అంతా "కలయో వైష్ణవ మాయయో" అన్నట్టుగా ఉంది!

(అందరూ గొల్లుమని నవ్వుతారు.)



# రంగము 7

(దూరంనుండి వినవస్తున్నట్టు సన్నగా ఫిడేలు వాద్యం వినిపిస్తుంది.)

నా: అబ్బబ్బబ్బ హేమా....ఎవరా ఫిడేలు? ప్రదోషకాలంలో ఆ చవ్వ డేమిటి?

హే: (దూరంనుండి) మనింట్లోకాదు నాన్నా. పక్కింట్లో రేడియో!

నా: ఉద్ధరించారు. వేళాపాళా లేకపోతేసరి! ఊఁ-సరే-కానీవోయ్ బావా నీ ధర్మబోధ!

బా: అది కాదు బావా—

నా: కాకపోతే మరేవిఁటోయ్-నాకు తెలియకడుగుతాను. ఇంతకీ నువ్విప్పుడనే దేమిటి?

బా: మొదటికొచ్చావా మళ్లీ. ఇంతసేవూ నోరు నొప్పెట్టేటట్టు చెప్పిందల్లా గాలికి పోయిందన్నమాట! చిలక్కి చెప్పినట్లు చెప్పాను!

నా: నే నన్నదీ అదే. చిలక్కి చెప్పినట్టు చెప్పావుగాని-మనిషికి చెప్పినట్టు చెప్పావా అని. ఇంతకూ-యిన్నేళ్ళు ఒంటికొచ్చి-యింత బతుకు బతికి-ఖర్మగాలినట్లు-యిప్పుడు నీ సలహాలా నాకు?

బా: ఎన్నేళ్ళు ఒంటికొస్తేనేం బావా?-ఇంగితజ్ఞానం లేకపోయాక?

నా: పోనీ-దీనికి సమాధానం చెప్పు. ఎవరిని ఉద్ధరించడానికి యీ కొంప నిలబెట్టమంటావ్? మధ్యాహ్నం నువ్వే అన్నావ్, లాభం ఒస్తే నిక్షేపంలా అమ్ముకోవచ్చుని!

బా: సరే-నాయినా-అమ్ముకో-నిక్షేపంలా అమ్ముకో! నా కెందుకు మధ్య. ఈ ఒక్కటీ చెప్పేసి అనక నీ యిష్టంవొచ్చినట్లు చెయ్-మా చెల్లెలు సంగతి ఏమిటంటావ్?

నా: ఏవుంది మీ చెల్లెలు సంగతీ?

బా: చెల్లెల్ని నా కూడా తీసికెళ్ళి పోతున్నాను.

నా: మహారాజులా తీసికెళ్లు. నాకేం మధ్య! ఆ పూజలూ పునస్కారాలూ అవీ హాయిగా అక్కడే చేసుకుంటుంది.

బా: సరే అయితే! వెళ్ళి పెట్టే బేడా సర్దుకోమంటాను.

(కాస్త బిగ్గరగా చెల్లెమ్మా చెల్లెమ్మా అని అరుచుకుంటూ వెళ్ళి ఇంకోగదిలోకి ప్రవేశిస్తున్నట్లు) చెల్లెమ్మా....ఒక్కర్తెవీ చీకట్లో ఏం చేస్తున్నావ్?

అ: ఏంచెయ్యగలను నాయనా? ఖర్మ యిలా కాలిందిగదా అని ఏడుస్తున్నాను. ఆఖరికి ఏడుకొండలవాడికి కూడా దయలేకపోయింది.

బా: బాగుంది-వరస. ఇలా ఏడుస్తూ కూర్చుంటే పనులవుతాయా? చేచేతులారా జీవితాలు పాడుచేసుకొని దేవుళ్ల మీదపడి ఏడిస్తే ఏంలాభం?

అ: నువ్వూ అలాగే అంటావా అన్నయ్యా? ఆఖరికి నువ్వూనా! ఏదో ఉద్ధరిస్తావని ఉత్తరం రాస్తే-అనండి-అనండి-అంతా నా ఖర్మ. (ఏడుస్తుంది.)

బా: (విసుగ్గా) రామరామ! ఏం మనుషులు. మిమ్మల్నందర్నీ చూస్తూంటే చివరికి నాక్కూడా వెర్రెత్తుతూంది. మిమ్మల్ని నేనుకాదుగదా-దేవుడుకూడా సరిదిద్దలేడు. అన్నవస్త్రాలకి లోటులేకపోయినా మన సంసారాలు ఎందుకు పాడవుతాయో యిప్పుడు తెలుస్తోంది—

అ: తెలిస్తే కాస్త నా చెవినికూడా పడెయ్యకూడదా నాయనా?— ఏంచేతంటావ్? అదేదో చెప్పు నాయనా-చెపితే ఆ ఏడుకొండలవాడికి ముడుపుకట్టి—

బా: ఊరుకో చెల్లెమ్మా! ఏడుకొండలవాడు కాదుగదా—డెబ్భైకొండలవాడు కూడా మిమ్మల్ని కాపాడలేడు—వివేకం లేకపోయాక—

అ: ఏమిటో నాయనా....నీ మాటలు నాకేం అర్థంకావడంలేదు.

బా: అర్థంకాకపోతే వదిలెయ్‌గాని—లేచి పెట్టే బేడా సర్దుకో. రాత్రిబండికి నాతో వచ్చేద్దువుగాని—

అ: మా తండ్రే! తప్పకుండా! కొన్నాళ్లపాటైనా యీ నరకంలోంచి తీసుకుపో తండ్రీ.

హే: (ప్రవేశిస్తూ) ఎక్కడికి తీసుకుపోవడం?

అ: ఎక్కడికి తల్లీ? నట్టేట్లోకి! ఇదంతా మీ నాన్న చేసిన నిర్వాకం. చూస్తున్నావుగా! అవసానకాలంలో చివరకి-

హే: అన్నంతపనీ చేస్తున్నావా మావయ్యా? అమ్మ నీకూడా వెళ్లిపోతే యిక్కడ నా గతేంగానూ?

(దూరంనుంచి హేమా హేమా అని కేక)

హే: (కాస్త బిగ్గరగా) ఇలా రండి. ఇక్కడా - యీ నట్టింట్లో అఘోరిస్తున్నాను. (మెల్లిగా) చెప్పవేం మావయ్యా! ఇక్కడ నా గతేం గాను? అమ్మకూడా వెళిపోతే యీ కొంపలో మా కింక మంచినీళ్ళు కూడా పుట్టవు.

బా: అదిగో! ఆ ధోరణే వద్దన్నాను హేమా. మాటాడితే అంత తీవ్రం దేనికి? నలుగురిలాగా కొంచెం నిగ్రహంతో మాటాడలేవూ?

హే: అంతేలే! ఒడ్డున కూర్చుని ఎన్ని కబుర్లయినా చెప్పొచ్చు. అనుభవిస్తున్న వాళ్ళకి తెలుస్తుంది కష్టం.

బా: కష్టసుఖాలన్నవి మనిషైన ప్రతివాడికీ ఉంటాయి, హేమా—

అ: ఉంటాయిగావి అన్నయ్యా-మేం పడుతున్న కష్టాలు శత్రువులకి కూడా రావద్దు నాయనా. అహర్నిశాలు ఒకటే రంపపుకోత అనుకో—

బా: ఎవరు ఆ రంపపుకోత పెడుతున్నది? ఎవర్ని?

హే: ఎవరేమిటి మావయ్యా....అందరూ అంతేననుకో-అంతా బాగానే ఉన్నారు-మధ్య నరకం అనుభవిస్తున్నది నేను—

శి: (ప్రవేశిస్తూ) హేమా....ఇక్కడా ఉన్నావు. పిలిస్తే కూడా కష్టంగా ఉందా నీకు. ఉంటుందిలే మరి. ఆఖరి ఘడియల్లో అలాగే ఉంటుంది.

హే: మీ కన్నీ తెలుసుగా.... మరి నన్నడగడం దేనికి?—చూస్తు న్నావా మావయ్యా? అంతే ఆయన ప్రయోజకత్వం.

బా: పోనీలే శివరావ్, ఆఖరు ఘడియలు కాబట్టి నువ్వేనా కాస్త ఓపిక పడితే సరిపోతుంది. ప్రయాణం పెట్టుకున్నావా?

శి: మరేనండీ.

బా: ఎందాకానో అడగొచ్చునా?

శి: వెళుతున్నాను మావయ్యగారూ—అలా అనంతవిశ్వంలోకి వెళు తున్నాను.

బా: ఫలానా చోటని లేదంటావ్. ఏం? పోనీలే-అదీ ఓ సరదావే. మరి హేమ సంగతి?

శి: హేమకేం లెండి. ఆవిడను కాపాడే ఆత్మీయులు చాలామంది ఉన్నారు.

బా: సరే అయితే. హేమా....నువ్వుకూడా పెట్టే బేడా సర్దుకో?

హే: ఎందుకు మావయ్యా?

బా: వివరాలన్నీ తరవాత చెపుతాగా-ముందు సర్దుకో. ఇంక మిగిలింది సావిత్రి. ఆ అమ్మాయి అభిప్రాయం కూడా కనుక్కుంటే- సావిత్రీ....సావిత్రీ....(అని పిలుచుకుంటూ వెళ్ళి) ఇక్కడేం చేస్తున్నావ్, ఒంటరిగా?

సా: ఓ....మీరా! ఉలిక్కిపడ్డాను....ఏం బాబయ్యగారూ!

బా: ఏమిటి అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్?

సా: తెలిసే అడుగుతున్నారు. ఏం?

బా: సావిత్రీ... ఒక్క ప్రశ్నవేస్తాను—దాపరికం లేకండా సమాధానం చెవుతావా?

సా: అడగండి బాబయ్యగారూ.

బా: ఇక్కడ నీ పరిస్థితి అన్ని విధాలా ఎలా ఉందో నాకు తెలిసింది. ఆ మాత్రం పోల్చుకోగలను. బోధపడనిది ఏమిటంటే-అన్ని సార్లు పుట్టింటికి వెళతానని బెదిరించినదానివి-ఒక్కసారైనా ఎందుకు వెళ్లలేదు? ఈ చీదరలో అలాగే అంటిపెట్టుకు ఉన్నావేం?.... మీ అమ్మా నాన్నా విసుక్కుంటారనా?

సా: ఆ భయం కూడా కొంచెం ఉందనుకోండి-కాని-కాని—

బా: అదిగాదు అసలు భయం. ప్రత్యేకించి ఎవర్ని చూసీ నీకు భయంలేదు-ఇంటి పట్టున ఉన్నంతవరకూ! అందుకే యీ సంసారం ఇంత బాధాకారంగా ఉన్నా-ఏదో అరుచుకుంటూ తిట్టుకుంటూ ఇక్కడే కాలక్షేపం చేస్తున్నావ్ గాని—

సా: అదీ తప్పేనా బాబయ్యగారూ? లేకపోతే ఏం చెయ్యమంటారు? కాపరానికి నీళ్ళు ఒదులుకోమంటారా? అదా మీరు చెప్పే సలహా?

బా: అదీ వరస. ప్రతి విషయమూ ఇలా ముళ్లుపెట్టి మాటాడడమేగాని-సవ్యంగా ఆలోచించడం మీరంతా మానేశారు....పోనీ యీ ప్రశ్నకి సమాధానం చెప్పు సావిత్రీ ఈ ఉమ్మడి సంసారం నీకింత బాధకరంగా ఉంటే, నువ్వూ మీ ఆయనా కలిసి వేరింటి కాపరం పెట్టలేక పోయారా?

సా: ఎలా చెప్పండి? సలహా చెప్పడం సులభమే. మీ మేనల్లుడుగారు అంత కష్టపడి సంపాదించి తెచ్చే జీతం ఆయన సిగరెట్టు ఖర్చుకే చాలదు.

బా: అదీ అసలు సంగతి. సాన్నిధ్యదోషం అన్నారు. నువ్వూ వాళ్ళలాగే తయారయావ్.

సా: అంటే?

బా: ఒక్క ముక్కలో చెపుతాను విను సావిత్రీ. ఈ ప్రపంచంలో మనకి ఎల్లప్పుడూ అవ్వాకావాలి బువ్వాకావాలి అంటే కుదరదు. నీకేమో సుఖం కావాలి! ఏ చిన్నసుఖాన్నీ ఒదులుకోలేవు.

సా: ఏం? సుఖపడాలనుకోవడం తప్పా?

బా: ఎంత మాత్రంకాదు—సుఖం కోరిన త్యాగాలు చేయగలిగితే-మీ ఆయన సంపాదించే కొంచెం సంపాదనతో వేరింటి కాపురం పెట్టి ఆ బాధలు పడ్డం నీ కిష్టంలేదు. ఏదో భయం!

సా: మీరు పొరపాటు పడుతున్నారు. నాకలాంటి భయాలేం లేవు!

బా: ఎందుకా దబాయింపు సావిత్రీ? నాదగ్గర దాపరికం దేనికీ! ఆ భయంవల్లనే వేరింటి కాపరం పెట్టలేదు. కాని యీ ఇంట్లోనే ఉంటూ వేరింటి కాపరంలోని సుఖాలు తెచ్చుకునేందుకు ప్రయత్నించావు. తక్కిన వాళ్ళు అడ్డుతగిలారు.

సా: పోనీలెండి, మీరనుకున్నట్టు చెడ్డదాన్నే అనుకోండి—

బా: అదిగో....మళ్ళీ ప్రతీదీ అలా తప్పర్థం చేసుకుని బాధపడకు-కాస్త విను-నలుగురు స్వార్థపరులు ఒక ఇంట్లోచేరి జీవితం సాగిస్తే యిలాగే ఉంటుంది.

సా: ఈ మాత్రానికేనా-నాకేదో ఉద్యోగం చూపిస్తానని ఆశపెట్టారు.

బా: ఆ సంగతీ ఆలోచిద్దాం — ఆలోచిద్దామేమిటి - సీరియస్‌గా ప్రయత్నిద్దాం. పోనీ దాపరికం లేకండా యీ ఒక్కటీ చెప్పు సావిత్రీ. ఏదో ఒకచోట ఒంటరిగానైనా సరే ఉద్యోగం చేసుకుంటూ ఉండాలని ఉందా—

సా: మేం యిద్దరం కలసి ఉండి—యిద్దరికీ ఉద్యోగాలు దొరికితే మరీ మంచిది—

బా: మీ అందరితో వచ్చిన చిక్కే అది. దాన్నే అవ్వా బువ్వా మాత్రం అన్నారు. ఒక వేళ అలా కుదరకపోతే?

సా: పోనీ-మీరే చెప్పండి-ఆ సలహాకూడా—

బా: చెప్తా-కాస్త వాడితో కూడా మాటాడీ-మాటలోనే వస్తున్నాడు-ఒరేయ్ గోపాలం ఇలా రా!

గో: (ప్రవేశిస్తూ) ఏం మావయ్యా!

బా: మా చిట్టితండ్రే! ఇలా కూర్చో కాస్సేపు. సావిత్రీ....నువ్వెళ్లి కాస్త కాఫీ తయారుచేసి తీసుకువస్తావా!

సా: అత్తగారు ఏమంటారో! మీకంటే ఏమీ అనరులెండి-తీసుకొస్తా.

బా: అలా అన్నావ్ బాగుంది....ఊఁ....ఒరేయ్ గోపాలం.... ఏవిట్రా ఆలోచిస్తున్నావ్?

గో: ఏవుంది మావయ్యా ఆలోచించడానికి. మా గొడవే! దీనికి అంతం ఎప్పుడా అని—

బా: అలా నువ్వేమీ బెంగట్టుకోకు - ప్రతిదానికి ఓ అంతం ఉంటుంది....దానికేంగాని-ఒరేయ్—ఒక్క ప్రశ్నకి కాస్త సూటిగా మనస్సు విప్పి సమాధానం చెప్పు-ఇప్పుడు మిమ్మల్నందర్నీ వేధిస్తున్న బాధ ఏమిటి?

గో: ఆ సంగతే అంతు చిక్కక ఛస్తున్నాను మావయ్యా! ఎవళ్లెలా పేడ్చినా నాకేం అభ్యంతరంలేదు. నా మానాన నన్నొదిలేస్తే అంతేచాలు.

బా: నీలాగే అందరూ ఆలోచిస్తే?

గో: ఆలోచించనీ! వాళ్ళదారికి నేనేం అడ్డురాలేదే.

బా: ఆ ముక్క నన్ను నమ్మమంటావ్! ఏం?

గో: నువ్వు నమ్మకపోతే నేనేం చెయ్యను?

బా: అలాగంటే లాభంలేదు. నమ్మించడానికి ప్రయత్నించు. ముందు దీనికి సూటిగా జవాబు చెప్పు—మీనాన్న యిల్లు అమ్మేస్తే నీకు బాధగా ఉంటుందా ఉండదా?

గో: బాగుంది మావయ్యా నువ్వు చెప్పే మాటా! తండ్రి యిల్లు అమ్మేస్తున్నాడంటే కొడుక్కి ఆ మాత్రం బాద ఉండడం సహజం

బా: ఒకటి. ఇంక రెండో విషయం చెప్పు... కాపురానికి తీసుకొచ్చిన వెంటనే సావిత్రిని ఉద్యోగం ఎందుకు మానిపించేశావ్?

గో: నాకేమిటో ఎబ్బెట్టుగా అనిపించింది. మానిపించేశాను! అదీ తప్పే?....ఇంతకూ నీ పాయింటేమిటో నాకు అర్థం కావడంలేదు.

బా: పాయింటు మరేం లేదురా అబ్బాయ్! నీ మానాన నిన్నొది లిస్తే అంతే చాలన్నావ్ గదూ....అలాగే నువ్వూ తక్కిన వాళ్ళని వది లెయ్యగలవా? లేదు-నీకు నచ్చిన పద్ధతిలో వాళ్ళు నడుచుకోవాలి. అలాగే వాళ్ళూ నీ గురించి అనుకుంటారు. అందులో ఎవళ్ళమట్టుకు వాళ్లు తమ స్వార్థమే ఆలోచిస్తే—

గో: ఆలోచిస్తే?

బా: ఆలోచిస్తే ఏవుంది? ఇంకా తెలియలేదూ? అచ్చు మీ సంసారంలా తయారవుతుంది.

గో: ఇంతకూ నువ్వనే దేమిటిప్పుడూ?

బా: ఏవీలేదు. సావిత్రి నిజంగా నీకు దక్కి, యిద్దరూ కలిసి సుఖంగా బతకాలని ఉందా?

గో: అదీ ఓ ప్రశ్నే?

బా: ప్రశ్నకాదు న్యాయానికి-కాని నువ్వే ఆ ప్రశ్న చేచేతులారా కల్పించావు. అయితే విను! తక్షణం నువ్వు వేరింటి కాపురంపెట్టు.... ఆదేమిటి-అంత భయపడుతున్నావ్?

గో: భయవాం....అబ్బే....నాన్న ఏవంటాడోననీ—

బా: మళ్ళీ డొంకతిరుగుడు మాటలు. అది కాదు నీ భయం! నీ ఆదాయంతో యిద్దరూ కలిసి ఇప్పుడు బతుకుతున్నంత సుఖంగా బతక లేరేమోననీ....ఒప్పుకో.

గో: అదీ ఒకారణమే ననుకో—

బా: ఆలోచించు. దానికి మార్గం ఏమిటి? అలాంటప్పుడు సావిత్రి కూడా ఉద్యోగానికి ప్రయత్నిస్తే తప్పేం? కొంచెం వివేకం ఉపయోగించు కోవాలం. ఇవాళ ఒక్కసారిగా మనం మనుషుల తత్వాల్ని మార్చలేం కాని ఆ తత్వాలు మనల్ని బాధించకండా పరిస్థితుల్ని కొంచెం మార్చుకోగలం అంటావా లేదా?

సా: (ప్రవేశిస్తూ) కాఫీ ఇదిగో బాబయ్యగారూ.

గో: సరే బాబాయ్! ఓ సారలా వెళ్ళొస్తాను. నాన్ననికూడా కొంచెం కదిపి చూస్తాను.

బా: సరే. వెళ్ళిరా!

శి: (ప్రవేశిస్తూ) ఇక్కడా ఉన్నారు....అయితే హేమని మీరు తీసికెళ్ళడం ఖాయమేనా బాబయ్యగారూ?

బా: ఆహా! ఏం? నీకేమైనా అభ్యంతరమా?

శి: అభ్యంతరం ఉంటేమట్టుకు నామాట చెల్లుతుంది గనకనా?

బా: అలా మాటలు అనకపోతే చెల్లించుకునే పరిస్థితులు కల్పించుకో కూడదా శివరావ్? ఎవరడ్డు వచ్చారు?

శి: సరే అయితే! నేనూ వెళతాను.

బా: వెళతానని పదిసార్లు చెప్పడంకంటె వెళ్ళిరావడం మంచిది శివరావ్.

శి: ఈమాటు చూద్దురుగాని! నేనూ ఆఖరి నిశ్చయానికొచ్చేశాను. హేమతోటీ మావఁగారితోటీ చెప్పేసి – హేమా.... హేమా....(అంటూ వెళతాడు)

హే: (దూరం నుంచి) మావయ్యా మావయ్యా (అని అరుచు కుంటూవచ్చి) మావయ్యా....కొంప మునిగిపోయింది! మళ్ళీ అంతా తల్లకిందులయింది. విన్నావా యీ సంగతి?

బా: ఏవిఁటా కంగారు? ఏం జరిగింది?

హే: ఏం జరిగిందా? తనకీ యిల్లు అక్కర్లేదని శరభయ్య కబురు పెట్టాడు. ఎడ్వాన్సు డబ్బు తిరిగి యిచ్చేయమన్నాట్ట. నాన్న మండిపడు తున్నాడు,

సా: వారెవా....కథ అడ్డం తిరిగిందన్నమాట. ఇప్పుడు మావఁ గారు ఏం చేస్తారో చూడాలి.

నా: (ప్రవేశిస్తూ) ఇక్కడా ఉన్నారంతా! ఏవిఁటీ అంటున్నావ్ సావిత్రీ? ఏంచేస్తానా? ఏంచేస్తానో చూడు. ఆ శరభయ్యగాడి పీక నులి మేస్తాను! మూడు చెరువుల నీళ్లు తాగిస్తాను. గాడిద....నస్మరంతిగాడు.... చెవలవాజమ్మ! నా ఇంటిమీద అభాండాలు వేస్తాడా?

బా: ఏంజరిగిందో సరిగ్గా చెప్పరాదా బావా?

నా: ఏం జరగాలోయ్? ఇంత నమ్మకద్రోహం ఉంటుందా? నువ్వే చెప్పు! పైగా నా యింటికి అచ్చిరాని కొంప అని పేర్లు పెడతాడా? నలభైరెండువేలు పోసికట్టిన నికేవంలాంటి భవంతికి? ఏం లోటొచ్చిం దనీ దీనికీ? చూపిస్తా నా తడాఖా! ఈ యింటికి కీడుందట—వాడి తల కాయ్—చెప్తాగా—అన్నట్లు మరిచిపోయాను—ఏవోయ్ బావా....

బా: ఏం నాయనా-ఏం?

నా: కొంపలో అందరిచేతా స్ట్రయిక్ చేయిస్తున్నావా....ఇందుకా నువ్వు దిగబడింది? ఏం సావిత్రీ?

సా: ఏం మావఁయ్యాగారూ?

నా: నువ్వూ మీ ఆయనా వేరింటి కాపరం పెడతారటగా.... వాడంటున్నాడు!

సా: అలాగనే అనుకున్నాం మావయ్యగారూ!

నా: ఏం? మీకూ యీ కొంప అచ్చిరాలేదా? ఏం హేమా? నువ్వూ మీ అమ్మాకలిసి మావయ్య ఊరు వెళ్ళిపోతున్నారూ? శకారుడు సరే తనూ వెళతానంటున్నాడు. ఎక్కడికంటే ఏమిటో పిచ్చిపిచ్చిగా వాగుతాడు. ఏమిటీ రభసంతా?....ఎవరూ మాటాడరేం?

హే: ఏం మాటాడమంటారు నాన్నగారూ?

నా: ఇంటావిడ సరే అశోక వృక్షంలో సీతామ్మ వారిలాగ—అదిగో—రా రా!

అ: మళ్ళీ ఏవొచ్చింది?

నా: ఏదీ రాలేదు — చివరికి నీ మాటే నెగ్గిందిలే. ఇల్లు అమ్మడంలేదు.

అ: ఏం?

నా: ఏవేఁవిటి? నా యిష్టం. నిక్షేపంలాంటి యిల్లు అమ్ముకోవలసిన ఖర్మ నాకేవొచ్చిందీ?

అ: అలా అన్నారు బాగుంది. మహరాజులాంటి మాట!

నా: అననూ మరీ! లేకపోతే ఆ శరభయ్యగాడు—శుద్ధ అశ్శరభ శరభయ్యగాడు! నా సంసారంలో లోట్లెంచుతాడా? ఔనా—ఇదిగో!—

అ: ఓయ్....చెప్పండి.

నా: నువ్వు మీ తమ్ముడితో పుట్టింటికి వేంచేస్తే ఇక్కడ నాగతేం కాను. పెరట్లో ఆవుల గతేంకాను!

బా: బావా....ఇలా చూడు....ఒక్కమాట వింటావా?

నా: చెప్పనాయనా! ఒక్కటేమిటి పదిమాటలు చెప్పు.

బా: కొన్నాళ్ళపాటు యీ సంసారంలో మార్పురావాలి. అప్పటికి గాని బుర్రల్లో చీదర ఒదలదు. అంచేత హేమనీ చెల్లెమ్మనీ మా ఊరు తీసికెళ్ళి కొన్నాళ్ళపాటు అక్కడ ఉంచుదాం.

అ: అయితే మరి అల్లుడి సంగతేవిటి?

బా: వస్తున్నా. అలా తొందరబడితే ఎలాగమరీ? అవునా బావా. నీకూ వయస్సు మళ్లింది....నాకూ వయస్సు మళ్ళింది. ఎన్నాళ్లీసంసార ఝుంఝూటం! అంచేత ఇద్దరం కలిసి ఓ రెణ్ణాళ్ళపాటు హాయిగా తిరిగి కాశీ, హరిద్వారం అవన్నీ తిరిగొద్దాం పద!

నా: బేషయిన మాటన్నావు. పద! కావాలంటే నేను యీ క్షణంలో సిద్ధం.

బా: పోగా యిక సావిత్రీ, గోపాలం. సావిత్రి వేరింటి కాపరంకోసం ముచ్చట పడుతోంది. ఏం సావిత్రీ! కొన్నాళ్ళపాటు ఈ ఇంట్లోనే వేరింటి కాపరం ఉండూ. ఏం?

సా: అలాగే.

నా: అంతా బాగుందిగాని—మరి అల్లుడు సంగతేమిటి?

బా: చెప్తాగా. మాటలోనే వచ్చాడు-ఏం శివరావ్? నీకు ఉద్యోగం చెయ్యాలని ఉందా?

శి: హూ! వేరే అడుగుతారు. నా సుందర స్వప్నాల్లో అదొకటి. కాని—

బా: కానిలేదు అర్ధణాలేదు — ఇదిగోవిను.. రేప్పే బొంబాయికి సిటీ వెళ్ళు. ఓ ఆర్నెళ్ళపాటు, అక్కడఉండు. ఉద్యోగప్రయత్నం చెయ్యి! నీ ఖర్చులకి కావలసిన డబ్బు నేనిస్తాను — అప్పటికి ఉద్యోగం దొరక్కపోతే-

శి: దొరక్కపోతే అనంతవిశ్వంలోకి వెళ్లిపోతాను.

బా: వెర్రినాయనా. నువ్విప్పుడున్నదీ అనంత విశ్వంలోనేనోయ్!

సా: కాదు బాబయ్యగారూ....ఆనందనిలయంలో! (అందరూ గొల్లుమని నవ్వుతారు.)

బా: సరేగాని బావా....మనలో మనమాట! నిజంచెప్పు. ఈ యింటికి నిజంగా ఎన్నివేలయింది?

నా: నిజంగా చెప్పమంటావా?

బా: అందుకేగా అడుగుతున్నదీ.

నా: అయితే కొద్దిరోజులు ఓపికపట్టు! కాశీలో విశ్వనాథుడి సమక్షంలో నిజం చెప్పేస్తాను!

(అందరూ గొల్లుమని నవ్వుతారు)

* * * *

(రైలు నడుస్తున్న చప్పుడు. ఏమి జన్మం బేమి జీవనమూ.... అనే పాట వినిపిస్తుంది.)

నా: ఏమిజన్మ మేమిట్రా నీ తలకాయ్. సర్వోత్కృష్టమైన మానవ జన్మరా యిదీ.

బా: బావా....కోట్లకి విలువైన మాట అన్నావోయ్!

(రైలు నడిచిపోతుంది)

(సమాప్తము)

# ఆనంద నిలయమ్
(హాస్య నాటకం)

రచన : గోరాశాస్త్రి

ఆలిండియా రేడియోలో రెండుసార్లు ప్రసారితమైన ఏడురంగాల నాటకం.

సమకాలిక సమాజంలో మధ్యతరగతి కుటుంబ జీవనం యీ నాటకానికి ప్రాతిపదిక. ఆ జీవనంలోని సుఖదుఃఖాలనూ వెలుగు, నీడలనూ ఇది దర్పణం చూపుతుంది.

లోగడ యీ రచయిత రచించిన "సెలవుల్లో —" అనే హాస్యనాటకం ఆంధ్రజీవితపు పగలు, అయితే యిది ఆంధ్రదేశపు రాత్రి. ఒకే సమకాలిక వాస్తవికతకు "సెలవుల్లో" బొమ్మ - "ఆనంద నిలయమ్" బొరుసు.

కథకుడుగా, రచయితగా, నాటకకర్తగా - పత్రికా రచయితగా గోరాశాస్త్రి ఆంధ్ర పాఠక లోకానికి చిరపరిచితుడు. ప్రస్తుతం "తెలుగు స్వతంత్ర" పత్రికను ఎడిటర్.

— పబ్లిషర్సు

ANANDA NILAYAM
— *by Gora Sastri*

WRAPPER PRINTED AT
SCRIPT ARTS, MADRAS-